# రోవెలుగులు

ఇతర నాటికలు

గోపీచంద్



దేశికవితామండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
జూలై 1958
రెండు రూపాయలు
దేశీ ప్రెస్, విజయవాడ.



---

సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ

ఈ సంపుటిలో :

లోవెలుగులు
మబ్బుతెరలు
గ్రుడ్డి సంఘం
మిగిలిన కథ
వెంకయ్యా మంకుపట్టు

---

## పాత్రలు :

అరుణకుమార్
ఉషాదేవి
డైరెక్టర్
సునంద
సేవకుడు
ప్రొడక్షన్ మేనేజరు
చంటిపిల్లవాడు
రత్నం
డాక్టరు
ఆర్టిస్టులు

# లో వెలుగులు

మానవ జీవితాన్ని ఒక నదీప్రవాహంతో పోల్చవచ్చు. ఊటగా పుట్టి, సెలయేరై, శాఖోపశాఖలుగా చీలి, మహా ప్రవాహమవుతుంది. పరిణామంలోనేకాక, నడకలోకూడా మార్పులుంటై. ఒక్కొక్కప్పుడు సమప్రదేశంలో, తొణక్కుండా గంభీరంగా ప్రవహిస్తుంది. ఒక్కొక్కప్పుడు నిమ్నోన్నత ప్రదేశాల్లో ఒడుదుడుకులుగా ప్రవహిస్తుంది. అప్పటి గమనం పరికించేవాళ్ళకి భయం కలుగుతుంది. ఈ నది ఏమౌతుంది? సముద్రాన్ని చేరుకోగలుగుతుందా? ఈ ఒడుదుడుకుల్ని తట్టుకొని మళ్ళీ ఏనాటికైనా సాఫీగా ప్రవహించ గలుగుతుందా? నదీప్రవాహం వొయ్యారంగా తన సౌందర్యానికి తానే ముగ్ధురాలవుతూ, నడుస్తూవుంటుంది. దానికి మరొక ప్రమేయమే వుండదు. తాను వూటగా పుట్టింది. సెలయేరు అవ్వాలని అపేక్షించింది. తన అపేక్ష తీరింది. శాఖోపశాఖలుగా విస్తరిల్లి, మైదానమంతా తానే కమ్ముకోవాలని అపేక్షించింది. తన అపేక్ష నెరవేరింది. మహా ప్రవాహం కావాలని అపేక్షించింది. తన అపేక్ష తీరింది. తన అపేక్షలన్నీ తీరినవనే ధీమాతో ప్రవహిస్తూవుంది నదీప్రవాహం. అటువంటి నదీప్రవాహానికి అకస్మాత్తుగా పర్వతశ్రేణి ఒకటి అడ్డు తగులుతుంది. నదీప్రవాహం ఉలిక్కిపడుతుంది. ఆమె శరీరం గజగజ వొణుకుతుంది. అలలు రెపరెప కొట్టుకుంటై. హృదయంలో దడదడ. కాని ఏం చెయ్యాలి? ఈ అపాయాన్ని తప్పుకోటానికి సిద్ధంగాలేదు. ఎదురుగా పర్వతశ్రేణి. తన్ను మింగటానికి సిద్ధంగా వుంది. క్షణక్షణానికి దగ్గరగా వొస్తూవుంది... నదీప్రవాహం ధైర్యం తెచ్చుకుంది. కళ్ళు మూసుకుంది...... అమాంతంగా పర్వతశ్రేణిని ఢీకొన్నది. ఒక్కక్షణం అంతా గంద్రగోళం, కల్లోలం

ఏం జరిగిందీ నదీప్రవాహానికి అర్థం కాదు. మరుక్షణం నిశ్శబ్దం. ఏమిటి? ఏం జరిగింది ? నదీప్రవాహానికి వడ తగ్గింది. తెప్పరిల్లింది. పర్వతశ్రేణిని చూచింది. పర్వతశ్రేణి మామూలుగానే వుంది. తనకు అడ్డుగా, ఆనకట్టగా నిలబడివుంది. తనని చూచుకుంది. తనకేమంత ప్రమాదం సంభవించలేదు. మొత్తానికి తన్ను మింగలేదీ పర్వతశ్రేణి.

నదీప్రవాహం మనసు కొంచెం కుదుటపడ్డది. పర్వతశ్రేణి కట్టెదుట కనపడగానే తనకు కలిగిన కంగారూ భయం తగ్గిపోయినై. దారి వెదుక్కుంటూ తన అలలను ముందుకుపంపి, సమాచారం తెలుసుకుంటూ కొంచెందూరం పర్వతశ్రేణి ప్రక్కగా నడిచింది నదీ ప్రవాహం. కాని ప్రయోజనం లేకపోయింది. పర్వతశ్రేణి మొండిది. దానిది రాతిగుండె. కష్టాలకు కరగదు.

నదీప్రవాహం ఈ సంగతి గమనించింది. తానే తన దారిని మార్చుకుంది. తూర్పుగా వెళ్తున్న తాను పడమరకు తిరిగింది. పశ్చిమవాహిని అయింది. కాని ఎంతమార్పు.

నదీప్రవాహం స్వభావం యీ సంఘర్షణతో పూర్తిగా మారిపోయింది. ఆమెకు ఇదివరకున్న అహంభావము ఇప్పుడు లేదు. ఇప్పుడామె తన వయ్యారం తాను చూచుకోవటంలేదు. తన సౌందర్యానికి తాను ముగ్ధురాలవటం లేదు. బాహ్యప్రపంచాన్ని చూస్తూవుంది. ప్రపంచంలోవున్న సౌందర్యంలో తానొక భాగం. ప్రపంచంలోవున్న ఆనందంలో తన ఆనందం శతాంశం. ప్రపంచంలో తన్నొక భాగంగా చూచుకోవటం నేర్చుకుంది. గంభీర్యమైన నడక అలవరచుకుంది. నెమ్మదిగా కష్టానికీ, సుఖానికీ అతీతంగా గమ్యస్థానం చేరటానికి నడుస్తూవుంది.

అందుకనే నదీప్రవాహం పశ్చిమానికి తిరిగిన చోటు అతి పవిత్రము గా చూచుకుంటాం మనం. అది తీర్థయాత్రలకు అర్హమైన చోటు. ఈ పా, తరుణుల జీవితగాథ, నదీప్రవాహంగా సాగి, కష్టాలను ఢీకొని,

మారిపోయి, కొత్త గాంభీర్యాన్నీ, విశాలదృష్టినీ, నిస్సంగత్వాన్నీ అలవరచుకొని, మన సాంప్రదాయంలో పశ్చిమ వాహినియన్న పవిత్రతను గడించుకున్నది.

## ఒకటవ రంగం - నదీజననం

అరుణకుమార్ వొక రచయిత. ఉషాదేవి వొక సినీతార. అరుణకుమార్ వ్రాసిన ఒక సినేరియోలో ఉషాదేవి ప్రముఖ భూమికనొకదానిని ధరించింది. ఆ చిత్రం ప్రొజెక్టుచేసి చూసుకుంటూ వుంటారు - ఉషాదేవీ, అరుణకుమార్, డైరెక్టరూనూ. ప్రొజెక్షను పూర్తి అయిం తర్వాత—

డైరె: కంగ్రాట్యులేషన్స్ ఉషాదేవీ, కంగ్రాట్యులేషన్స్. అద్భుతంగా నటించావు. ఆహాహా, నిన్ను నీవు మరచిపోయి పాత్రలో ఎంత గొప్పగా లీనమైపోయావ్! నీ యాక్టింగ్ చూస్తుంటే, నేనే గుమ్మయిపోయాం, ఈమె ఉషాదేవేనా! రోజూ నా కళ్ళముందు కనపడే ఉషాదేవేనా!! నాతో రోజూ రిహార్సల్స్ చెప్పించుకునే ఉషాదేవేనా!! అనిపించింది నాకే. వండర్‌ఫుల్, అతి వండర్‌ఫుల్ ఉషాదేవీ.

ఉషా: మీ వాత్సల్యం కొద్దీ అంటున్నారుగాని డైరెక్టరు గారూ, నాదేముంది?

డైరె: అదిసరే ఉషాదేవీ ... నేను పర్టిక్యులర్ శ్రద్ధ తీసుకొని నీకు రిహార్సల్స్ ఇచ్చినమాట నిజమే. యాంగిల్స్ సెలెక్టు చెయ్యటంలోకూడా నా నైపుణ్యాన్నంతా చూపినమాటా నిజమే... షాట్స్‌కూడా...

ఉషా: మీ అనురాగానికి కంతకూ థేంక్స్ డైరెక్టరుగారూ, అది నేను కాదనను. కాని అరుణకుమార్‌గారు సృష్టించిన పాత్ర నాకు సరిగ్గా సరిపోయింది. వారు నన్ను పూర్తిగా అర్థం చేసుకొని, నా శక్తి సామర్థ్యాలను గ్రహించి నాకు అన్నివిధాలా తగినపాత్రను సృష్టించారు.

డైరె: (మొహం చిట్లించుకొని) అది సరే ...

ఉషా: (అరుణకుమార్‌తో) మీకు నా కృతజ్ఞత ఏవిధంగా అందజెయ్యాలో తెలియకుండావుంది.

అరుణ: అ, హాఁ, అదేంమాట ఉషాదేవీ! నేను చేసింది ఏముంది? మీరు నా పాత్రకు జీవంపోశారు; మెరుగులు దిద్దారు. చిత్రం చూస్తుంటే ఇది నేను సృష్టించిన పాత్రేనా, ఇన్ని వన్నె చిన్నెలు, ఇన్ని మెళుకువలు, ఇంత అభినయం, ఇన్ని లోతులు ఇవన్నీ నేను ఊహించినవేనా? అని అనిపించింది నాకే.

ఉషా: (నవ్వి) మీ రెప్పుడూ ఇంతే... మీ గొప్పతనంక్రింద ప్రకాశించే మాబోటివాళ్ళకు గొప్పతనం ఆపాదించి మురుసుకుంటూ వుంటారు.

అరు: లేదు లేదు ఉషాదేవి, నేను నిజమే చెపుతున్నాను.

ఉషా: (కొంటెగా) ఏమిటి నిజం?

అరు: (కంగారుపడి) అదే...

ఉషా: ఏది?

అరు: ఈ చిత్రం గొప్పతనానికి మీరే కారణం.

ఉషా: (కొంటెగా) కాదు కాదు-మీరే.

అరు : (నిస్పృహగా) మీరలా అంటే నేనేం చెప్పగలను?

ఉషా: చిత్రం గొప్పతనానికి మీరే కారణం అని ఒప్పు కుంటే సరిపోయె!

అరు : మరి కారణం మీరుగా?

ఉషా: నేను కాను.

అరు : కాదు మీరే...

ఉషా: మీరు.

అరు : మీరు.

ఉషా: ముమ్మాటికీ మీరే.

అరు : ముమ్మాటికీ కాదు.

డైరె : (పై సంభాషణ జరుగుతున్నంతసేపూ అయిష్టంగా వొకరిమీందనుంచి వొకరిమీందకు చూపులు మలుపు తుంటాడు. చివ్వరికి భరించలేక అడ్డుపడతాడు) ఉష్, మైగాడ్! దీని కెప్పుడైనా అంతు వున్నదా? మీరు గొప్ప అంటే మీరు గొప్ప!! రాత్రిం బగళ్ళు మైండ్ నంతా వేగించుకుంటూ, శక్తినంతా ధారపోసి చిత్రాన్ని డైరెక్టుచేసిన నాసంగతి ఏమిటి?

అరు : (సిగ్గుపడుతూ) క్షమించండి.

ఉషా: పిక్చరు డైరెక్టరు సాక్షాత్తూ సృష్టికర్త. సృష్టించటం సృష్టికర్త పని. సృష్టి వైచిత్ర్యానికి సృష్టికర్తను పొగడటం ఎందుకు?

డైరె : ఈ ఇండస్ట్రీలో వున్న డిసీజే ఇది. పిక్చరు బాగుంటే.
స్క్రిప్టు బోయ్ మొదలుకొని, కవివరకూ నేను చేశాను
అంటే నేను చేశానని మీసాలు మెలిపెడతారు.
డైరెక్టరు ఊసు ఎత్తేవాడే వుండడు. అప్పుడు డైరె
క్టరు వోక దిష్టిపిడత. ఇక పిక్చరు ఫెయిలయిందో
అంతా డైరెక్టరు నెత్తిన రుద్దుతారు. అతనికి షాట్
డివిజనే చేతగాదు అంటారు. సీనిక్ అరేంజ్‌మెంటే
చేతగాదు అంటారు. చివ్వరికి హీరోయిన్ని ప్రేమించి,
తత్ఫలితంగా ఆబిడకు ఎక్కువ సీనులు పెట్టి, క్లోజప్పు
లన్నీ ఆబిడకే ఇచ్చి పిక్చరు బూడిదపాలు చేశాడు
అంటారు. ఛా, థ్యాంక్ లెస్ జాబ్.

అరు : నా ఉద్దేశం అదికాదు డైరెక్టరుగారూ.

డైరె : అది కాకపోతే ఇంకేమిటయ్యా. సినిమా అంటే
ఏమిటో తెలియకుండా ఏ మారుమూలలో కూర్చొని
కథలు వ్రాసుకునేవాళ్ళని ఫీల్డులో ప్రవేశపెట్టి,
వాళ్ళతో నానా ఇబ్బందీ పడి సినిమా టెక్నిక్
అంతా నూరిపోసి తీరా వోకపద్ధతికి తీసుకువచ్చే
టప్పటికి...

ఉషా: క్షమించాలి డైరెక్టరుగారూ...మీ ప్రతిభను కించ
పరచాలని ఎవ్వరికీ లేదు... అందులో అరుణకుమార్
గారికి అసలే లేదు... ఏదో నవ్వుతాలకొద్దీ అనుకున్న
మాటలకు మీరు ఈవిధంగా విపరీతార్థం కల్పించి...

డైరె : అబ్బెబ్బె...నా కటువంటి ఉద్దేశం ఏమీ లేదు ఉషా
దేవిగారూ... నేనూ నవ్వుతూనే అంటున్నాను...

దాని కేంగాని ఇప్పటికీ పిక్చరు అయింది. నెక్స్టుపిక్చరు సంగతి కూడా మనం త్వరగా తేల్చుకుంటే మంచిది.

ఉషా: తొందిర ఎందుకులెండి... ఈ పిక్చరు రిలీజు కాని వ్వండి.

శ్రీ రా: అలాగే... కాని వొకసంగతి. ఓం ప్రథమంలో నీకు ఫిల్ము కెరియర్ చూపింది నేననిమాత్రం మరచిపోకేం.

ఉషా: నేను ఇంకొక పిక్చర్లో యాక్టు చెయ్యటం అనేది జరిగితే అలాగే.

అరు: అదేమిటి ఉషాదేవీ! యాక్టు చెయ్యకపోవటం ఏమిటి?

శ్రీ రా: (వెటకారంగా నవ్వి) ఎంత పిచ్చివాళ్ళయిన్యా కూ కవులంతానూ. నేను నిన్ను ప్రేమించానని ముక్కుకు సూటిగా చెప్పే స్త్రీగానీ, నాకింకా యాక్టు చెయ్యాలని ఉంది అని చెప్పే సినిమాతారగానీ ఎక్కడైనా ఉంటుందా?... ఎందుకంత కంగారుపడతావ్? తనకు కావలసింది అక్కర్లేదు అని చెప్పటంతో ప్రారంభిస్తుంది స్త్రీ. తాను చెయ్యదల్చింది చెయ్యను అని చెప్పటంతో ప్రారంభిస్తుంది స్త్రీ... నాకు తెలియదా?... నేను ఇండస్ట్రీలో ఇరవై ఏళ్ళనుంచీ డక్కాముక్కాలు తింటున్నవాణ్ణి. సరే, వొకసారి స్టుడియోకి వెళ్ళి వస్తా... నువ్వుకూడా వస్తావా ఉషాదేవీ...

ఉషా: క్షమించండి.

శ్రీ రా: సరే సరే... డింటులకు ఆర్డరు చేశాను... అవి తీసుకొని వెళ్ళండి. బై, బై.

డైరెక్టరు హడావిడిగా నిష్క్రమిస్తాడు- హిందీ పిక్చరులోని వొక ట్యూన్ హమ్ చేసుకుంటూ.

అరు : అదేమిటి ఉషాదేవీ, అలా అన్నారు?

ఉషా: ఏమన్నాను!

అరు : పిక్చర్లలో నటించే విషయంలో సందేహం వెలిబుచ్చారు.

ఉషా: నిజమే అరుణ్... నాకు నటించాలనే కోర్కె నానాటికీ నశించి పోతోంది.

అరు : ఎందుకని?

ఉషా: నాకు ఎందుకనో ఇదంతా చాలా కృత్రిమంగా కనుపిస్తూ వుంది అరుణ్. మనస్సు పెట్టలేనిచోట పెట్టటం, లేని ఆవేశాలను పొందటం, సహజంగా వున్నవాటిని అణుచుకోవటం, ఇదంతా నా మనస్సుని చాలా చీకాకు పరుస్తూవుంది.

అరు : కాని మీరు మీ సంగతే ఆలోచిస్తున్నారు గాని కళాదేవిసంగతి ఆలోచించటంలేదు. మీరు విరమించటం కళకే తీరని లోటు. వ్యక్తులు కొంచం ఇబ్బంది పడ్డైనాసరే, కళాదేవికి సేవ చెయ్యటం మహోత్కృష్టమైన పని...

ఉషా: అన్నీ తెలిసిన మీరే అలా అంటే నేను ఏంచెప్పను? ఈ వాతావరణం భరించటం కష్టమైపోతూవుంది. ఈ కృత్రిమ వాతావరణంలో ఏం జరిగినా జరగవచ్చనే వొక్కొక్కనాటి గుండె గుభేలు మంటుంటది.

ఇటువంటి ప్రవాదాలకు లోనై కళాసేవకు పూను
కుంటే, మనకువచ్చే ప్రతిఫలం ఏమిటి? మనను
సానుభూతితో అర్థంచేసుకునేవా రొక్కరు ఉండరు
గదా! మనకు అతకని అపవాదు అనేది వుండదు గదా!
మనస్సులకు శాంతి దూరం అవుతుంది గదా! ఇదంతా
ఎందుకు వచ్చినగొడవ చెప్పండి.

అరు : వీటినన్నిటినీ ఎదుర్కొని కళారాధన చెయ్యాలి ఉషా
దేవీ. ఆనందానికి దారి కష్టాలతోనే నిర్మించబడి
వుంది...

ఉషా: అయితే మరి మీమాటేమిటి? మీరుకూడా అప్పు
డప్పుడూ ఈ పరిశ్రమకు ఎంత దూరంగావుంటే
అంత మంచిది అంటూ వుంటారే! డబ్బు సంపాదన
కోసం ఈ సినిమా పరిశ్రమలో వున్నదానికంటే,
కట్నం పుచ్చుకుని ఏ అనాకారినో వివాహం చేసు
కొని కాపురం చెయ్యటం అన్నివిధాలా సుఖప్రద
మైన పని అని చెపుతూ వుంటారే! మీమాటేమిటి?

అరు : నావిషయం వేరు.

ఉషా: ఎలా వేరంటారు?

అరు : నేను లేకపోయినా సినిమాకళకు నష్టం లేదు.

ఉషా: నేను లేకపోయినా అంతే...

అరు : కాదు కాదు...

ఉషా: అయితే మీమాటా కాదుకాదు.

అరు : నామాట వినండి మరి?

ఉషా: వినను...

ఇద్దరూ వొకరినొకరు చూసుకొని నవ్వుకుంటారు.

అరు : చూడగా చూడగా మనిద్దరి మనస్తత్వం వొకలే లాగుంది.

ఉషా: కాబట్టే మీరు నాకు సరిపోయే పాత్రను సృష్టించ గలిగారు.

అరు : కాబట్టే మీరు నా పాత్రకు జీవంపోసి మెరుగులు దిద్దగలిగారు.

ఉషా: కాదుకాదు.

అరు : అవునవును.

మళ్ళీ ఇద్దరూ నవ్వుకుంటారు. నవ్వుఆపి మళ్ళీ ఇద్దరూవొకేసారి మాట్లాడటం మొదలుపెడతారు.

ఉషా: మొత్తానికి...
అరు : మొత్తానికి...

ఇద్దరూ మళ్ళీ నవ్వుతారు.

ఉషా: ఇద్దరి మనస్తత్వం...

అరు : ఒకటే...

సేవకుడు: (ప్రవేశించి) డ్రింక్స్ సార్.

ఇద్దరూ చెరొకగ్లాసు తీసుకొని త్రాగుతుంటారు.

అరు : ఉషాదేవి!

ఉషా: ఊఁ...

అరుణకుమార్ మాట్లాడడు.

ఉషా: మాట్లాడరేం ?

అరు : చాలారోజులనుంచీ...

ఉషా: ఊఁ... చాలారోజులనుంచీ...

అరు : ఒకవిషయం అడుగుదాం అనుకుంటున్నాను.

ఉషా: అడగండి.

అరు : నేను...

ఉషా: ఊఁ నేను——

అరు : మీరు నన్ను చాలా ఇబ్బంది పెడుతున్నారు... ... అడగదలచిండి నోటినుంచి బయటకు రానివ్వకుండా చేస్తున్నారు.

ఉషాదేవి కిలకిలా నవ్వింది. ఒక్క క్షణం అతను వెల వెల పోయాడు...గుక్క తిప్పుకుని తానూ నవ్వటం ప్రారంభించాడు. డైరెక్టరు ప్రవేశిస్తాడు. వారి అన్యోన్యత భరించలేక అతని ముఖం కందగడ్డ అవుతుంది.

డైరె: (దగ్గి) ఎక్స్‌క్యూజ్ మీ——... స్టుడియోకి వెళ్దామని కారుదగ్గరకు వెళ్ళాను. ఏదో జ్ఞాపకం వచ్చింది... జ్ఞాపకం అంటే జ్ఞాపకం కాదు... ...జ్ఞాపకం కాదు వచ్చింది. I am sorry ... ఛా, థ్యాంక్ లెస్ జాబ్

తబ్బిబ్బుగా నిష్క్రమిస్తాడు. ఉషాదేవి అరుణ కుమార్ లు అతన్ని చూచి నవ్వుకుంటూరు. ఉషాదేవి లేచి వెటకారంగా డైరెక్టర్ని ఇమిటేట్ చేస్తుంది.

ఉషా: (దగ్గి) ఎక్స్‌క్యూజ్ మీ... ... స్టుడియోకి వెళ్దామని కారుదగ్గిరికి వెళ్ళాను ఏదో జ్ఞాపకం వచ్చింది...... జ్ఞాపకం అంటే జ్ఞాపకంకాదు...... జ్ఞాపకంకాదు వచ్చింది. I am sorry ఛా, థ్యాంక్ లెస్ జాబ్.

అరుణకుమార్ ఉషాదేవి Imitation చూచి డొక్క లు చెక్కలు అయ్యేటట్టు నవ్వుతాను. ఆమెకూడా నవ్వుతుంది.

అరు : ఉషా దేవి ?

ఉషా: ఊఁ.

అరు : ఒక్క కోరిక.

ఉషా: ఏమిటి ?

అరు : తోటలోకి వెళ్దాం.

ఉషా: ఓ... ఇప్పాళ్ళ నేను ఎటువంటి సాహసకృత్యానికైనా తయారే... నాడియాకుమల్లే గోడలు దూకమన్నా దూకుతాను; పడవలు వాయించమన్నా వాయిస్తాను; ఈలలు వెయ్యమన్నా వేస్తాను.

తోటలో :

ఉషా: అరుణ్... అరుణ్ ?

అరు : ఉషా !

ఉషా: ఎక్కడ ?

అరు : ఇక్కడ.

ఉషా: ఎక్కడో చెప్పవూ ?

అరు : ఇక్కడే.

ఉషా: ఎక్కడ ?

అరు : నీ హృదయసీమలో.

ఉషా: అరుణ్ !

అరు : ఉషా !

ఉషా: నీవు ఎక్కడ వున్నదీ తక్షణం చెప్పాలి.
అరు : తెలుసుకో లేవూ ?
ఉషా: ఎలా తెలుసుకోను ?
అరు : నా కంఠధ్వనివల్ల.
ఉషా: నీ కంఠధ్వని ఎక్కడిది గుర్తుపట్టేను ! ఒకప్పుడు
ఇక్కడ - అక్కడ- అక్కడ - ఇక్కడ, పోటుంటా
నీ కంఠధ్వనే వినిపిస్తూ వుంది నాకు.
అరు : అలాగేం ?
ఉషా: అవును అరుణ్.
అరు : ఉషా ?
ఉషా: ఆఁ.
అరు : చెప్పటం మరచిపోయాను.
ఉషా: ఏమిటి ?
అరు : ఏమిటో.
ఉషా: చెప్పు అరుణ్.
అరు : నేను ఎక్కడ వున్నదీనీ.
ఉషా: ఎక్కడున్నావ్ ?
అరు : ఏమో !
ఉషా: అయ్యో.
అరు : చెపుతున్నా.
ఉషా: చెప్పు అరుణ్.
అరు : మధుర స్వప్నాల్లో.

ఉషా: చెప్పవ్!

అరు : చెప్పను.

ఉషా: అయితే ఏం చేస్తానో తెలుసా?

అరు : తెలియదు.

ఉషా: నీకు కఠినశిక్ష విధిస్తాను.

అరు : ఎలా?

ఉషా: నేను అలిగీ...

అరు : ఉహుం వద్దు.

ఉషా: నాతో మాట్లాడనివ్వను.

అరు : అయ్యయ్యో!!

ఉషా: అయితే చెపుతావా?

అరు : ఆఁ.

ఉషా: ఎక్కడ వున్నావు అరుణ్?

అరు : నీ పాదాల చెంత దేవీ.

ఇద్దరూ కిలకిల నవ్వుతారు.

ఉషా: ఎక్కడ నేర్చుకున్నావోయి ఇవన్నీని.

అరు : నీ కౌగిల్లో దేవీ...

ఉషా: అఁ...అఁ!!...ఊరుకోవూ!

సునంద : (దూరంగా ప్రవేశించి) అరుణ్?

అరు : సునందా?

సునం: ఎక్కడ అరుణ్?

అరు : వస్తున్నా సునందా, అక్కడే వుండు...

సునంద దగ్గరకు వెళ్తాడు.

సునందా ?

సునం: ఏమి అరుణ్ ... ఏమి ఈ ఊరుప్పులు ?

అరు : సునందా, ప్రియస్నేహితురాలా ? ఉష నన్ను వివాహం చేసుకోటానికి అంగీకరించింది.

సునం: అదేమి ?

అరు : అవును సునందా ... ఈ ప్రపంచంలో నన్ను మించిన అదృష్టవంతుడు మరొకడు లేడు.

*  *  *

ప్రొడక్షన్ ఆఫీసులో డైరెక్టరు శుభలేఖ చదువుతుంటాడు.

డైరె : "ఉషాదేవీ అరుణకుమారుల వివాహమహోత్సవం" ఊః ... ఛా ... థ్యాంక్‌లెస్ జాబ్ !

# రెండవ రంగం : ప్రశాంత ప్రవాహం

ఊటుగ్గా బయలుదేరిన నది సెలయేరు అవుతుంది. తరువాత ప్రశాంతంగా ప్రవహిస్తుంది. ఏమవుతుందో, ఏనదయ్యే భాగ్యానికి నోచుకో లేదేమో, ఊటుగానే అంతరించి పోతుందేమో అనే భయాలూ తాపత్రయాలూ, ఉద్రేకాలూ, ఒడుదుడుకులూ ఇకలేవు. సమ, ప్రదేశంలో, సూటిగా, నెమ్మదిగా, హాయిగా ఆత్మవిశ్వాసంతో సాగిపోతూవుంది ప్రవాహం.

అరుణకుమార్ ద్విగుణీకృతోత్సాహంతో పుస్తకాలు వ్రాస్తున్నాడు: ఉషాదేవి భర్తకోరికపై చిత్రాలనుంచి విరమించుకోలేదు. ఇంటిపనికీ చిత్రాలలోపనికీ వైరుధ్యం లేదని నిరూపించుకోటానికో అన్నట్లు ప్రవర్తిస్తూవుంది.

## ఇంటిలో

ఉషా: అరుణ్.

అరు : ఆఁ.

ఉషా: టీ.

పుస్తకం మూసిన ధ్వని. టీ కప్పులు చేతులుమారిన ధ్వని.

ఉషా: తాగవేం?

అరు : చూస్తున్నాను.

ఉషా: (సిగ్గుగా) ఏమిటి అరుణ్ ;

అరు : నీ సౌందర్యం.

ఉషా: ఊఁ...

అరు : నీ సౌందర్యం వెన్నెలవంటిది ఉషా.

ఉషా: అంటే ?

అను : ఎంత అనుభవించినా తనివితీరనిది.

ఉషా: అలాగేం!

అరు : రాణీ!

ఉషా: ఆఁ...

అరు : ఇలా దగ్గరకు రా.

ఉషా: ఇంకెంత ?

అరు : మరీ మరీ...

ఉషా: ఊఁ...

అరు : రావ్రూ ?

ఉషా: మీ రేమి వ్రాస్తున్నారో చెపితే...

అరు : పాట.

ఉషా: పాటలు ఎప్పటినుంచీ ?

అరు : నీవు నా హృదయాన్ని స్వాధీనం చేసుకున్నప్పటి నుంచీ... ...

ఉషా: ఏదీ ? (పుస్తకం తీసుకున్నధ్వని) చదవనా ?

అరు: అంతకంటేనా ?

ఉషా: (పాడుతుంది)

నిశీ, నిశీ,

ఏమి ఈ అంతర్వాహిని
　　ధగ ధగలు.

ఈ ప్రాగు కణాల
　　భుగ భుగలు.

ఎక్కడికీ ప్రయాణం ?
ఎందులకీ కల్లోలం ?
కాళరాత్రీ, కడుపులోకీ
కాలసర్పం పడగలోకీ
మాటురక్కసి నోటిలోకా ?

వచ్చాను నిశీ !
వెతికి వెతికి, వేసారి
వచ్చాను, తిరిగి
ఇరువది అయిదేండ్లక్రితం
పోగొట్టు కొన్న నీకోసం
వచ్చాను :
ఇదే వచ్చాను.
నిశీ, ఓ అమవశ నిశీ
నేను నీ కవిని; రవిని

అరు : ఉషా, నీగొంతులో కోయిల లున్నవి.

ఉషా: నా దేముంది ?

అరు : ఆమాట మరచిపోవు.

ఉషా: సత్యం మరువగలమా ?

అరు : సరి (టీ త్రాగి కప్పు టేబిల్‌పైన వుంచిన ధ్వని.)

ఉషా: అదేమిటి ?

అరు : ఏది ?

ఉషా: ఆ టేబిల్‌పైన.

అరు : షైలు, నీవు పాల్గొన్న చిత్రాన్ని గురించి ప్రచురించ బడిన...

ఉషా: ప్రశంసలా?

అరు : అవును.

ఉషా: అయితే నేను చూస్తాను.

అరు : పోనీ విమర్శలే అనుకో.

ఉషా: అయితే ఇవ్వండి...

అరు : నేను చదువుతాను—(చదువుతాడు)

ఈ క్రొత్త చిత్రంలో ఉషాదేవి అమృత ఝురులను కురిపించింది. ప్రేక్షకుల హృదయాలను చూరగొన్నది.

*　　　*　　　*

ఉషాదేవి అత్యద్భుత నటన గ్రేటాగార్బోని మర పించింది.

*　　　*　　　*

ఉషాదేవి ఉజ్వల తారాపథగమనం. అభినయం సంగీతం ఉషాదేవి సొత్తు. ఈ చిత్రంలో ఉషాదేవి హిందీ తారలను అధిగమించింది.

*　　　*　　　*

ఉషాదేవి ఆంధ్రుల అభిమానతార. ఆంధ్రులు గర్వించదగిన తార ఉషాదేవి...

ఉషా: అబ్బబ్బ, ఇక ఆపుదురూ.

అరు : (నవ్వుతూ) ఏమిటి?

ఉషా: చిత్రాన్ని గురించి విమర్శలంటివే! అన్నీ నన్ను గురించిన పొగడ్తలే...

అరు : నిన్ను గురించి చెపితే చిత్రాన్ని గురించి చెప్పినట్లేనని వాళ్ళ అభిప్రాయం.

ఉషా: చాలుగానీండీ, ఆ ఫైలు వొక్కసారి ఇలా ఇవ్వండి.

అరు : ఎందుకో చెపితే?

ఉషా: ఇవ్వండి, చెపుతాను.

అరు : చెపితే ఇస్తాను.

ఉషా: ఇవ్వరూ?

అరు : చెప్పవ్?

చేతిలో ఫైలు లాక్కుంటుంది. ఇద్దరూ నవ్వుకుంటారు.

ఉషా: ఇవ్వకపోతే లాక్కోలేననుకున్నారా?

అరు : ఎలా అనుకుంటాను? నువ్వేమైనా చెయ్యగలవు.

ఉషా: చూడండి, ఈ ఫైలుకి రెండో ప్రక్కన మరికొన్ని విమర్శలున్నాయి. అవి మీరుచూడలేదు... ... చదవమంటారా?

అరు : నీవు నీ కంఠం విప్పితే, నా హృదయం విప్పి నేను నృత్యం చెయ్యనా?

ఉషా: (ఫైలు తిప్పుతూ) పాడరుగదా?

అరు : అంతపని చెయ్యనులే భయపడకు.

ఉషా: ఆఁ. ఇక వినండి... సుప్రసిద్ధ రచయితలైన అరుణ కుమార్‌గారి నూతన గ్రంథం; ఆంధ్ర సాహిత్యంలో చరిత్రలో నూతన శకారంభం.

అరు : ఏమిటది ఉషా?

ఉషా: (నవ్వుతూ) మీ పుస్తకంమీద వచ్చిన రివ్యూలు.

అరు : ఆ ఫైల్లోకి ఎలా వచ్చినై.

ఉషా: నేను గుచ్చితే వచ్చినై.

అరు : అయితే ఆ ఫైలు ఇదివరకే నువ్వు చూశావన్న మాట!

ఉషా: కొంతవరకు.

అరు : అమ్మదొంగా-ఎంతపనిచేశావు!!

ఉషా: మరేమనుకున్నారు?

అరు : నాఫైలు నాకిచ్చివెయ్.

ఉషా: నే నివ్వకేం?

అరు : ఇవ్వవ్?

ఉషా: ఇవ్వను. మాఆయన పుస్తకంమీద రివ్యూలున్నాయి ఇందులో. ప్రాణప్రదంగా దాచుకుంటాను.

అరు : మరి మా ఆభినయమీద ప్రశంస లున్నాయిగదా అందులో.

ఉషా: ఏమో, ఆసంగతి నాకేం తెలుసు.

అరు : ఇద్దువ్.

ఉషా: ఇవ్వనంటూ వుంటే.

అరుణకుమార్ లాక్కోబోతాడు. ఉషాదేవి కిలకిల నవ్వుతూ తప్పించుకుంటుంది, డైరక్టరు ప్రవేశిస్తాడు; వెంటనే అతని ముఖం కందగడ్డ అవుతుంది.

డైరె : (దగ్గి) క్షమించాలి,

అరు : ఎవ్వరు ? డైరెక్టరుగారా ?

ఉషా: నమస్కారం.

అరు : దయచెయ్యండి.

డైరె : నమస్కారం ఉషాదేవీ... బాగున్నావా కవీ ?

అరు : ఆఁ. ఈ కుర్చీమీద కూర్చోండి.

డైరె : నీ క్రొత్తపుస్తకం చదివాను కవీ. వన్డర్ఫుల్. అతి వన్డర్ఫుల్గా వుందంటే నమ్ము. మూను కథలు రాయకపోతే పోయావుగాని మంచిపుస్తకం వ్రాశావు.

అరు : ఏదో మీరు అభిమానంకొద్దీ...

డైరె : లేదుకవీ, ముఖప్రీతి మాటలుకావు. నిజంగా ఉషాదేవీ; నేను చూస్తున్నానుగా, కవికి మేరేజ్ అయినప్పటినుంచీ డెప్త్ ఎక్కువయింది.

అరు : దానికి ఉషే కారణం.

డైరె : ఉషాదేవికూడా చాలా మారిపోయింది.

ఉషా: దానికి మీకవే కారణం.

డైరె : సరే మీరు కారణం అంటే మీరు కారణం. ఇది మాత్రం మారలేదు.

ఉషాదేవీ, అరుణకుమార్లు చిరునవ్వు నవ్వుకుంటారు.

డైరె : సరే మిమ్మల్ని ఎక్కువసేపు డిస్టర్బ్ చెయ్యటం నా కిష్టంలేదు. నెక్స్టుపిక్చరు రిహార్సల్స్ త్వరలో మొదలుపెట్టబోతున్నానని చెప్పి పోదామని వచ్చా.

ఈసారి నీకొక కొత్తరోల్ ఇవ్వదలచాను ఉషాదేవీ. నీవు కోరినట్టే మంచి డెప్త్‌వున్న రోల్ ఇస్తాను. కాని ఏదైనా గ్లామర్‌గరల్ - అంటే వాంప్ వేషం అయితే...

ఉషా: ఇకవన్నీ పెట్టకండి నాకు. ఈ వేషాలైనా అరుణ బలవంత పెట్టబట్టే ఒప్పుకున్నాను. లేకపోతే ఉన్న దానితో తృప్తిపడి ఇంటిపట్టున ఉందామనివుంది.

డైరె: సరే సరే నీఇష్టం, ఎవ్వరికేదితప్పినా నాకు మాత్రం ఈ చిత్రాలు తియ్యటం తప్పదుగదా... ఛా, థ్యాంక్ లెస్‌జాబ్. వస్తాను కవీ. స్క్రిప్టు పంపుతాను, ఒకసారి చూడు. గుడ్‌బై.

నిష్క్రమిస్తాడు.

అరు : పాపం మనిషి మంచివాడే.

ఉషా: అదేమంచి. మీరు నన్ను బలవంతపెట్టకుండా వుంటే పోయేది.

అరు : ఏదో పాపం కష్టపడి నిన్ను అభివృద్ధిలోకి తీసుకు వచ్చాడా ? నువ్వు లేకపోతే డిస్ట్రిబ్యూటరు డబ్బివ్వనన్నాడని కళ్ళనీళ్ళు పెట్టుకుంటే 'పోనీలే పాపం' అనుకున్నాను.

ఉషా: సరే, మీరు వ్రాసుకోండి. నాకు లోపల కొంచెం పనిఉంది.

టీకప్పులు సర్ది లోపలకు తీసుకువెళ్తుంది. అరుణకుమార్ వ్రాసుకుంటూ ఉంటాడు. సునంద ప్రవేశిస్తుంది.

సునంద: అరుణ్ !

అరు : (తల పైకెత్తి) సునందా! నా ప్రియస్నేహితురాలా!
రా... రా... ఇలా కూర్చో.

సునం: ఏం చేస్తున్నావ్, అరుణ్?

అరు : అదే సునందా, నిన్న నీకు చదివి వినిపించానే ఆ
అధ్యాయం పూర్తిచేస్తున్నాను.

సునం: ఇంతలోకి నేను అడ్డువచ్చాను.

అరు : లేదు సునందా లేదు. నువ్వు ఎదురుగా కూర్చుంటే
నెలరోజులుపట్టేపని వొక్కక్షణంలో పూర్తిచేస్తాను.
కూర్చో... కూర్చో... ఆఁ... ఉషా! ఉషా!

ఉషా: (లోపలనుంచి) ఆఁ.

అరు : సునంద వొచ్చిందిఉషా. ఇంకొక కప్పు టీ పట్టుకురా.

సునం: వొద్దు అరుణ్.

అరు : టీదేముంది సునందా!

సునం: (సాలోచితంగా) ఈ పనులన్నీ ఉషాదేవిచేత చేయిం
చటం బాగాలేదు అరుణ్.

అరు : అన్నీ తనే చెయ్యాలంటుంది సునందా? నే నేం
చెయ్యను?

సునం: నీ వరకైతే సరే. ఆమె కోరటంలో కూడా అర్థం
వుంది. కాని మాబోటివాళ్ళకికూడా మధ్యమధ్య
చెయ్యవలసివస్తుంది చూడు. మనిద్దరం యిక్కడ
కూర్చుంటే తాను మనకు టీ పట్టుకురావటం, ఇప్ప

టికి కాకపోతే, ఎప్పటికైనా ఆమె మనస్సును కలత పెట్టకపోదు.

అను : నువ్వు పొరబడుతున్నావు సునందా. ఉష మన లాంటిదికాదు. ఆమెకు సేవలోనే ఆనందం వుంది సునందా! సునందా! ఈ పాట విను. నేను ఉషమీద వ్రాశాను సునందా!

## విద్యుల్లత మెరుపు

నాకు నేడు
రాత్రులన్న బులుపు.
ఎందుకా?
ఆమె నలుపు.
నాకు నేడు
వెలుతురన్న వెరపు
ఎందుకా?
ఆమె నలుపు.
నాకు నేడు
చెరుపులన్న వలపు.
ఎందుకా?
ఆమె నలుపు.
నాకు నేడు
స్వర్గమన్న ఉలుకు
ఎందుకా?
ఆమె నలుపు.

ఆపం నలుపు
మేఘశ్యామ నునుపు
నేన నలుపు
విద్యుల్లత మెరుపు.

సునంద ఈపాట విని ఆలోచనలో పడుతుంది.

## మూడవ రంగము : నదీ విస్తరణ

నదికి ప్రవాహం కావాలనే అపేక్ష తీరింది. ఇప్పుడు శాఖోప శాఖలుగా విస్తరిల్లాలనే తాపత్రయం పుట్టింది. తనకు ఉపనదులు ఉండాలి. అవి తన పోషణలో వుండాలి. వాటికి తాను నడవటం నేర్పాలి; మాటలు నేర్పాలి; అపాయాలనుంచి తప్పించుకునే ఉపాయాలు నేర్పాలి. వాటి స్వభావాలను తన ఇష్టం వచ్చినట్టు, తను కోరినట్టు సరిదిద్దాలి. తన శరీరంలో భాగం పెట్టి అవి త్వరలో ప్రవాహాలు అయ్యేటట్టుగా చేసి తాను చూచి ఆనందించాలి.

రిహార్సల్స్ గది. డైరెక్టరూ, ఉషాదేవీ, అరుణకుమార్, ప్రొడక్షన్ మేనేజరూ మరి కొంతమంది ఆర్టిస్టులూ వుంటారు......డైరెక్టరు ఉషాదేవికి చెప్తుంటాడు...

డైరె : కథలో కల్లా మంచి ఇంపోవున్నసీను ఇదే ఉషాదేవీ. ఇక్కడ నీ శక్తి సామర్థ్యాలనంతా చూపించాలి. ఇదీ సిట్యుయేషన్—

ఆమె కథానాయిక: భర్త విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. ఇక రాడు. ఆమెకు ప్రపంచం అంతా శూన్యం. సర్వం శూన్యం. ఎటుచూచినా దిక్కులేదు. అటువంటి

సమయంలో ఆమెకోరకు ఆమె రెండేండ్ల కొడుకు, తప్పటడుగులు వేసుకుంటూ, నంగినంగి మాటలు చెప్పుకొంటూ ఎదురుగా వస్తాడు... ఆమె చూస్తుంది; ఆమె హృదయం ఉప్పొంగుతుంది. పిల్లవానికోసం ఆక్రోశిస్తుంది. ఇదీ సిట్యుయేషన్. ఈ సిట్యుయేషన్ తర్వాత వచ్చే డైలాగులు నువ్వు చెప్పాలి. కానివ్ ....

ఉషాదేవి డైలాగుల కాగితం చూసుకుంటూ అలాగే చూస్తునివుంటుంది.

డైరె: ఉషాదేవీ!

ఆమె ప్రతిమలా చూస్తునివుంటుంది.

అరు : ఉషా ?

ఉషా: ఆఁ...

అరు : మొదలుపెట్టు.

ఆమెకన్నులలో అప్రయత్నంగా అశ్రుకణాలు తిరుగుతై. ఆమె ప్రారంభిస్తుంది.

ఉషా: నాయనా, రా నాయనా (గద్గదిక స్వరంతో) తండ్రీ, నీ తల్లిని నీవు విడిచిపెట్టవుగా... అను తండ్రీ. విడిచి పెట్టను అను... అమ్మా విడిచిపెట్టను అను. అనవూ? నాయనా వొక్కసారి... అను... ఆ!! ... తండ్రీ, నా చిట్టితండ్రీ, ఏదీ మళ్ళీఅను ... నేను నీ తల్లిని... తల్లిని ... (గట్టు త్రెంచుకున్న ఏడుపు) నీతల్లిని నాయనా ... (ఆపుకోలేని ఏడుపు... అంతా నిరు

త్తరులై చూస్తుంటారు. (వుషాదేవి ఏడుస్తూనే వుంటుంది.)

డైరె : ఉషాదేవీ ?

అరు : ఉషా ? ... ఏమిటి అలా వొణికిపోతున్నావు ?

ఉషా: ఆఁ ! ... ఆఁ !

అరు : ఏమిటి ఉషా ?

ఉషా : ఏమీలేదు.

డైరె : వన్డర్‌ఫుల్, పూర్తిగా పాత్రలో లీనమైపోయింది ఉషాదేవి. నా ఇరవైయేళ్ళ అనుభవంలో ఇటువంటి యాక్టింగ్ ఎక్కడా చూడలేదు... ఓహో ! !

ఉషా: నన్ను ఇంటికి తీసుకువెళ్ళండి.

అరు : ఏమిటి ?

ఉషా: ఎందుకో, నేను నావశం తప్పిపోతున్నాను.

డైరె : తీసుకువెళ్ళు కపీ !

ప్రొ.మే: ఎలాగూ వచ్చినవారు వచ్చారు. ఆ సీను రిహార్సల్సు పూర్తి అయితే...

అరు : ఇప్పుడిక రిహార్సల్సు చెయ్యలేములెండి; మరొకసారి చూచుకుందాం.

డైరె : సరే నీ యిష్టం కపీ (ప్రొడక్షన్ మేనేజరుతో) మన కారుమీద పంపించు.

ప్రొ.మే: ఎలాగూ వచ్చినవారు వచ్చారు. ...

డైరె : సరేలేవోయ్ ... నీ గొడవ నీది ... ఎప్పుడూ పెట్రోల్ బాట్ లుక్ !

ప్రొ. మే: నా ఇష్టం...

డైరె : మళ్ళీ కలుస్తా ఉషా దేవీ...

అరుణకుమార్, ఉషాదేవీ, ప్రొడక్షన్ మానేజర్ నిష్క్రమిస్తారు.

డైరె : ఒక్క పిక్చరులో కాస్త మంచి పేరు వస్తే చాలు-- ఇదీ వరస...రిహార్సల్సుకి రావటం కష్టం. వస్తే ఉండటం కష్టం. ఛా! థ్యాంక్ లెస్ జాబ్.

ఒక ఆర్టిస్టు: నాకువొక అనుమానంగావుంది డైరెక్టరుగారూ.

డైరె : ఏమిటోయ్ నీ అనుమానం ?

ఆర్టి : ఆమె వైఖరిచూస్తే ఉషాదేవిగారికి నెలతప్పిందని అనుమానంగావుంది.

డైరె : ఆఁ ! ఏమిటీ ! !

ఆర్టి : పుత్రునికోసం ఆమెచూపిన ఆక్రోశం, తరువాత ఆ క్రోశం ఆమెమీద చూపిన ప్రభావం నాకు దృఢమైన అనుమానం కలిగించినై ...

డైరె : ఒకవేళ నిజమే అయితే ఏం చెయ్యాలి ?

ప్రొ. మే: కాంట్రాక్టు రద్దు చేసుకోవలసిందే. ఇంకా మనం సెట్సుమీదకే వెళ్ళలేదు. అంటే పిక్చరు ఇంకా అథమపక్షం ఎనిమిదినెలలైనా పడుతుంది. పిక్చరులో వుంటే ఆనాటికి ఆమె ఏవిధంగా తయారైనా అవవచ్చు—చూడలేం సార్.

డ్రై రె : అదిసరేలేవోయ్. కూరి ఆమె లేకపోతే డిస్ట్రిబ్యూటరు డబ్బు ఇవ్వడే... థా థ్యాంక్ లెస్ జాబ్.

* * *

ఉషాదేవికి పుత్రప్రాప్తి కలుగుతుంది
మరి కొన్నాళ్ళకు. అరుణకుమార్ ఇల్లు.

అరు : ఉషా? ఉషా!

ఉషా: (లోపలనుంచి) ఏమి అరు...?

అరు : ఒకసారి ఇలారా.

ఉషా: (లోపలనుంచి) వస్తున్నా.

అరు : త్వరగా రావాలి.

ఉషా: (ప్రవేశించి) ఏమిటి అరుణ్?

అరు : (పిల్లవాణ్ణి చూపుతూ) చూడు వీడు నా కాగితాలన్నీ ఎలా పాడుచేశాడో!

ఉషా: అయ్యయ్యో, అదేం పనిరా (ఎత్తుకొని) నాన్నగారి కాగితాలు అలా పాడుజెయ్యవచ్చా? ఊఁ? తప్పు కాదూ?

అరు : నేనేదో ఆలోచించుకుంటూ కూర్చున్నా. ఎప్పుడు వచ్చాడో వచ్చాడు. తీరాచూద్దునుగదా ఒక్కొక్క కాగితం చించుతూ కూర్చున్నాడు.

ఉషా: ఉన్నచోట ఉండడు. (కొంటెగా) అంతా మీ బుద్ధే!

అరు : నాబుద్ధా?

ఉషా: లేకపోతే ఎక్కడనుంచి వస్తుంది!

అరు : వాడు అచ్చుగా నీపోలికే. నిన్న సునందకూడా ఆమాటే అన్నది.

ఉషా: అయితే సునందా, మీరూ నిన్న కొంటెవానిక్రింద జమ కట్టారన్నమాట.

అరు : కాదు ఉషా ...

ఉషా: మీరు ఎలాగన్నా అనుకోండి. బాబు తెలివితేటలు ఇంకొకరికి రావు.

పిల్లవాణ్ణి ముద్దు పెట్టుకుంటుంది. వాడు ఏడుస్తాడు.

అరు : సరి సరి ... కొంచెం వ్రాసుకోవాలి. అవతలికి తీసుకొని వెళ్లు.

ఉషా: ఊరుకో బాబూ ఊరుకో. మీ నాన్నగారు వ్రాసుకుంటారట. కాస్త ఊరుకో ... మా బాబుకదూ! (సముదాయిస్తుంది.)

అరుణకుమార్ వ్రాసుకుంటూ ఉంటాడు.

ఉషా: చూడండీ.

అరు : కాస్త వ్రాసుకోనిద్దూ.

ఉషా: మీదగ్గరకు వస్తానని ఎలా చేతులు జాపుతున్నాడో!!

అరు : ఒక్క క్షణం వుండు ఉషా ... మధ్యలో వున్నాను.

ఉషా: అదే మీదగ్గరవుంది. మా బాబుకంటే మీకు పుస్తకాలే ఎక్కువ.

అరు : అబ్బబ్బ... అదేంమాట ఉషా.

ఉషా: లేకపోతే వాడు వస్తానో అని చేతులు చాపుతుంటే, మీకు ముద్దనేదే లేదేం ?

అరు : ఎందుకు లేదు. ఏదో పనిమీద వుండి అనటంగాని. ఇలా ఇవ్వు ... రా బాబూ!

ఉషా పిల్లవాణ్ణి అరుణకి ఇస్తుంది.

ఉషా: ఉండు బాబూ... నాన్నదగ్గర కాసేపు ఆడుకో, ఇంట్లోపని చూచుకొని ఇప్పుడే వస్తాగాని.

అరు : నీవైపే చేతులు జాపుతున్నాడు.

ఉషా: వాడికి తెలుసా ఏమి ? మీవన్నీ మరీని.

అరు : చూడు ఎలా జుట్టుపీకుతున్నాడో.

ఉషా: ఇంతలోనే అరిగిపోల్లే ! ఒక్క-క్షణం చూస్తూవుండండి వస్తాను. వ్యాయామం కాసేపు ఆపితే పోయేది ఏమీ లేదు.

ఉషాదేవి లోపలికి వెళ్తుంది. క్రమక్రమేణా పిల్లవాడి గోల ఎక్కువ అవుతుంటుంది.

అరు : ఊరుకోవయ్యా, ఎందుకిలా మొహం రక్కుతావ్.

సునంద ప్రవేశిస్తుంది

సునం: అరుణ్ ?

అరు : ఆఁ.

సునం: ఏం చేస్తున్నావ్ ?

అరు : ఇదుగో .. ఊరుకో బాబూ... మా నాయనవుకదూ,

సునం: ఉష ఎక్కడికి వెళ్ళింది ?

అరు : ఇంట్లో పనిమీద వుంది.

సునం: నిన్న మన సంభాషణ మధ్యలోనే ఆగిపోయింది.

అరు : అవును.

పిల్లవాడి ఏడుపు.

అరు : ఊరుకో... ఊరుకో బాబూ... ఏడవకు.

పిల్లవాడు ఆగడు.

సునం: నాకివ్వు. నేను ఎత్తుకుంటే ఊరుకుంటాడేమో.

సునంద ఎత్తుకుంటుంది. వాడు గుక్కలుపెట్టి ఏడుస్తాడు.

అరు : ఊరుకోరా...

సునం: ఆయీ... ఆయీ.

పిల్లవాడు ఏడుపు ఎక్కువచేస్తాడు. లోపలనుంచి ఉష ఆతురతగా వస్తుంది.

ఉషా: ఏమిటి ?

అరు: ఏడుస్తున్నాడు.

ఉషా: ఏం చేశారు ?

అరు : ఎత్తుకున్నాను. ఏడుపు ఆపకపోతే సునంద కిచ్చాను.

ఉషా: రా బాబూ రా... (ఎత్తుకుని) చూడు అమ్మని కాదూ. చ్ చ్ చ్ ఏడుస్తారా ఎక్కడైనా! ...... నా బాబు ఏడవడు. నా బాబు బంగారం...

పిల్లవాడు ఏడుపు ఆపుతాడు.

ఒక్కక్షణం పిల్లవాణ్ణి ఆడిచటం చేతగాకపోయె... పనిలేకుండా వ్రాస్తూ కూర్చోవటంటే ఎంతసేపైనా కూర్చుంటారు. ఎవ్వరికి బరువైనా నాకు బరువు కాదు నా బాబు.

పిల్లవాణ్ణి చంకన ఎత్తుకొని లోపలకు వెళ్తుంది.

సునం: ఏమిఅరుణ్ అలా చూస్తున్నావు?

అరు : ఏమున్నది సునందా.

సునం: ఉష త్వరత్వరగా మారిపోతూవుంది అరుణ్. నువ్వు పట్టించుకోకపోతే లాభం లేదు.

అరుణ్‌కుమార్ ఆలోచిస్తూ కూర్చుంటాడు.

సునం: అరుణ్.

అరు : ఆఁ.

సునం: ఏదో వ్రాస్తున్నావు.

అరు : ఏమీ లేదు...

సునం: నన్ను చూడనివ్వు.

బల్లమీదవున్న కాగితం తీసుకుంటుంది.

అరు : చదువకు సునందా?

సునం: చదువనియ్...తప్పేముంది?

నాదు జీవిత పథమ్మున
తనదు పాదముల నామె
యూరకే ప్రవేశ పెట్టలేదు.

*  *  *

నాదు హృదిలోన
అణగి మణగి
పెనగి పెనగి
చిక్కురులు పోయిన

భావ సంతతి నెల్ల

తనదు

మృదుల హస్తాల

చిరునవ్వు నేత్రాల

గికురించి, సవరించి

అమృతమును తొణికించి

గాని ఊరుకోదు.

*　　　　*　　　　*

నాదు జీవిత పథమ్మున

తనదు పాదముల నామె

యూరకే ప్రవేశపెట్టలేదు.

అరు : ఆపు సునందా, ఆపు. నా పాటలు నన్నే వెక్కిరి
స్తున్నాయి...

# నాలుగవ రంగం: వేగవాహిని

ఇంతవరకూ నిశ్శబ్దంగా ప్రవహించిన నదికి వొడుదుడుకులు మొదలు. నదికి ఉరవడి హెచ్చవుతుంది. వొడ్డు విరుచుకొని పరవళ్ళు త్రొక్క నారంభిస్తుంది. ఎక్కడికీ త్వరితగతి? ఏది గమ్యస్థానం? ఎదుట ఆ కనపడేది పర్వతశ్రేణి కాదుగదా!!

## అరుణకుమార్ ఇల్లు

సునం: ఇంకెప్పుడు పూర్తి చేస్తావు అరుణ్? మా సమితి వాళ్ళంతా ఎంతో ఇదిగా అడుగుతున్నారు. ఈసారి మేము ఏర్పాటుచేసే కవితా గోష్ఠిలో నీ కొత్త పాటలు ముఖ్యస్థానం ఆక్రమించాలి అంటున్నారు.

అరు : నిజమా సునందా?

సునం: నిజం అరుణ్.

అరు : ఇటీవల నాపాటలు వాళ్ళు చదివారుగదా! ఏమను కుంటున్నారు?

సునం: అట్లా అడుగుతావేం అరుణ్. మొన్న సురేంద్రుడు అన్నాడు—'అదేమి చిత్రమో, ఎన్నాళ్ళనుంచో మనం చెప్పాలి అనుకున్న విషయాలు ఇట్టేచెప్పే స్తాడు అరుణ్; అతని ఊహలు లోకాతీతాలైనా, అతని మాటకు ఏనా వేరుసత్యం లేదు. అనిపిస్తుంది' అని. ఈమధ్య శశి కనిపించింది అరుణ్, ఆమె అన్నదీ, 'అరుణ్‌లో నేడు నేను మాతృమూర్తిని

చూస్తున్నాను' అని. 'శ్రీని కూలంకషంగా అర్థం
చేసుకున్న రచయిత అరుణ్' అని.
ఏదో వ్రాస్తున్నావ్ ? (కాగితం తీసుకుంటుంది)

అరు : కవిత్వం కాదు సునందా ?

సునం: కాకపోతే ఏం ? (చదువుతూ) ఎంత బాగా వ్రాశావు!

ఇది కవిత్వమే. (బిగ్గరగా చదువుతుంది.)
"మనం పరిపూర్ణ హృదయంతో ఆరాధించే ఆశ
యాలు, మన సహజానుభూతుల పరిపూర్తి, మనం
పైకి చెప్పడానికికూడా నోచుకోని, సాహసించని
కోరికలు—అన్నీ వాక దివ్య మంగళ విగ్రహంలో
సగుణబ్రహ్మగా రూపొందుతాయి; అవతరిస్తాయి.
కాని వీటిని భౌతిక జనితమైన మన అజ్ఞానంవల్ల
భూలోకానికి దిగలాగి, ఆ దివ్యమంగళ విగ్రహానికి
కూడా అపచారం చేస్తాం..."
ఎంత నిజం ? (సాలోచితంగా) ఎంత బాగా చెప్పావ్
అరుణ్ !

అరు : నిజంగానా సునందా ?

సునం: నిజం.

అరు : అర్థంలేని వేదాంతంలోపడి పోతున్నా ననుకుంటు
న్నాను...

సునం: లేదు అరుణ్—దివ్యత్వాన్ని చేరుకుంటున్నావు...
అమృతాన్ని ఆస్వాదించబోతున్నావు. (మళ్ళీ చదువు
తుంది) "ప్రేమ సంగీతం వంటిది. అనేక రాగాలతో

కూడినది సంగీతం. నాకు సావేరిరాగం చాలా ఇష్టం. సావేరి వింటూవుంటే పరవశుడనైపోయి ఈ ప్రపంచాన్ని నా అశ్రుధారలతో నింపివేస్తాను. కాని భైరవి రాగమూ ఇష్టమే. కళా పరిపూర్తికి ఈ రాగాలన్నీ తోడుపడాలి. ఒక్కొక్క మనోభావానికి అనుగుణంగా, వొక్కొక్క రాగం కదిలిస్తూ వుంటుంది. అన్నిటికంటే నన్ను ఎక్కువగా కదిలించేది కాంభోజి కాని ఇతర రాగాలకుకూడా స్థానంవుంది... (ఆపి అరుణ్ కన్నీరు కార్చటం చూస్తుంది)" అరుణ్ !

అరు : ఏమి సునందా ?

సునం: ఎందుకీ కన్నీరు ?

అరు : హృదయం ఎందుకో మంచు కరిగినట్లు కరిగిపోతూ వుంది.

సునం: అరుణ్ !

అరు : సునందా ... ఈ బాధను నేను సహించలేకుండా వున్నాను...

ఆమె వొడిలో తలపెట్టుకొని పసిపిల్లవానికిమల్లే గోదిస్తాడు...ఆమె 'అరుణ్' 'అరుణ్' అంటూ, తల నిమురుతూ సముదాయిస్తూ వుంటూంది ... 'అరుణ్' 'అరుణ్' అని బయటనుంచి ఉషాదేవి పిలుపులు వినిపిస్తయ్...అరుణకుమార్ చివాలున లేచికూర్చుంటాడు పిల్లవాడికి కావలసిన వాకెడు ఆటవస్తువులతో ఉషాదేవి ప్రవేశిస్తుంది.

ఉషా: అరుణ్ ! చూశావా బాబుకి ఎన్ని వస్తువులు కొనుక్కొని వచ్చానో... చూడు సునందా! ... బాబుపేరు

చెపితే ఆ మొహంలో కాస్త కాకపోతే కాస్తయినా సంతోషం వస్తుందేమో...... ఇంతకీ బాబెక్కడ ?

అరు : లేదూ... ఇక్కడే ఆడుకుంటున్నాడే...

సునం: ఇక్కడే వుండాలి, మే మేదో మాట్లాడుకుంటూ కూర్చున్నాం.

ఉషా: కాసేపు బాబుని చూట్టానికి కష్టం అయింది. అస్త మానం ఏదోవక వంకతో గుసగుసలు తప్ప ఇంకొక పనే లేకపోయె !, బాబూ ... బాబూ ...

ఆతురతగా వెతుక్కుంటూ ఇంట్లోకి వెళ్తుంది ... అరుణకుమార్ సునందలు నిరుత్తరులై నుంచుని వుంటారు... లోపలనుంచి 'బాబూ' 'బాబూ' అనే ఉషాదేవి పిలుపులు వినిపిస్తూవుంటై ... కాసేపటికి లోపలనుంచి 'నాబాబు ఏమైనట్లు ? బాబూ,' అని కన్నీరు తుడుచుకుంటూ గాభరాగా ఉషాదేవి ప్రవేశిస్తుంది. ఇంతలో బయట కల కలం వినిపిస్తుంది. 'అయ్యయ్యో, ఎంతపనిజరిగింది !' 'ఘోరం' 'ఘోరం' అనే మాటలు వినవస్తయి. అంతా భయ భయంగా గడపవైపుకి చూస్తారు. రక్తంతో తడిచివున్న పిల్లవాణ్ణి చేతుల్లో పెట్టుకొని ఇరుగు పొరుగువారు ప్రవేశిస్తారు...

ఉషా: బాబూ...ఏం బాబూ ?...ఏం జరిగింది బాబూ... బాబూ (అంటూ ఎదురుగా ప్రవేశించి పిల్లవాణ్ణి చేతుల్లోకి తీసుకొని భోరున ఏడుస్తుంటుంది.)

అరు : డాక్టరుకి ఫోనుచెయ్యి సునందా.

సునంద పక్కగదిలోకి నడుస్తుంది.

ఉషా: అయ్యో తండ్రీ... ...ఇదే మన్యాయం ? నాబాబు కేం జరిగింది ? పలకవేం బాబూ...

ఒకరు: ఏం జరిగిందో ఏమో... వాకిట్లో నుంచి పారుకాడుతూ వచ్చాడేమో... రోడ్డు మధ్యకు వచ్చాడట... ఒక గుర్రపు బండి... ...

ఉషా: బాబూ... నిన్ను చూచుకొని నేను బ్రతుకున్నా బాబూ... నన్నేంచేసి పోయావు తండ్రీ.

అరుణ: ఊరుకో ఉషా. [సముదాయించ బోతాడు]

ఉషా: మీరు నన్ను అంటుకోకండి నా దగ్గరకు రాకండి. (ఫోను చేసి ప్రక్కగదిలో నుంచి వస్తున్న సునంద ఈ మాటలువిని ఆగిపోయింది) మీరు చేసేపనులన్నీ నాకు తెలియ వనుకున్నారా? మీకు నేను భారం అయి పోయాను. చివ్వరికి ఈ నా బాబు భారం అయి పోయాడు — బాబూ... నాకెందుకురాదు చావు?

పిల్లవాడిని చేత్తో సవరిస్తు ఏడుస్తుంటుంది. అంతా నిర్ఘాంతి పడి చూస్తుంటారు. డాక్టరు హడావిడిగా ప్రవేశిస్తాడు.

డాక్టరు: ఏం జరిగింది?

అరు: పిల్లవాడు డాక్టరుగారూ... బయటకు పారాడుకుంటూ వెళ్ళాడు... ఏం తగిలిందో ఏమో...

డాక్ట: అయ్యయ్యో... (పిల్లవాణ్ని పరీక్షిస్తుంటాడు.)

ఉషా: డాక్టరుగారూ... ... వీడిమీద ప్రాణం పెట్టుకొని బ్రతుకుతున్నా... పుత్రభిక్ష పెట్టండి... ఆజన్మాంతం మీకు కృతజ్ఞురాలినిగా వుంటాను.

డాక్ట: ఉండమ్మా...... నేను చెయ్యగలిగింది చేస్తాను... కొంచెం...

డాక్టరు పరీక్షిస్తూంటాడు.

ఒకరు: మేము చూసేటప్పటికి గోడ్డు ప్రక్కన పడివున్నాడు, ఏ బండి చక్రమో తగిలి వుంటుంది. బండివాడు ఏం ప్రమాదం వస్తుందో అని బిడ్డను అక్కడే వదలి దూసుకుపోతున్నాడు.

డాక్టరు పరీక్ష పూర్తయినతరువాత ఒక నిట్టూర్పు విడుస్తాడు.

ఉషా: డాక్టర్ ?

డాక్ట: దైవ విధమ్మా... మానవుని చేతులు దాటిపోయాడు పిల్లవాడు.

ఉషా: అయ్యో బాబూ...నన్నేం చెయ్యమన్నావు తండ్రీ (పిల్లవాడి మీదపడి ఏడుస్తుంది.)

*   *   *

అదేస్థలం. మధు నాథ్ అరుణకుమార్ సునందలు విచారంగా కూర్చొని వుంటారు. ఉషాదేవి ప్రక్క గదిలోనుంచి, ఇంట్లోనుంచి వెళ్లిపోయే ఉద్దేశంతో ప్రవేశిస్తుంది. ఆమె మొహం ప్రశాంతంగా పూర్తిగా మారిపోయివుంటై.

అరు : ఎక్కడికి ఉషా ?

ఉషా: నన్ను అడక్కండి.

అరు : అదేమిటి ఉషా !

ఉషా: చాలు - ఇంతవరకు జరిగింది చాలు... మీ మాటలు నమ్మి కూర్చున్నందుకు నాకు తగినశాస్తి చేశారు. నాకు వొక ప్రత్యేక జీవితం అనేది లేకుండా చెయ్యటమే కాక చివరికి నా బాబునికూడా నాకు కాకుండా చేశారు.

అరు : ఎందుకు ఉషా నన్నిన్ని మాటలు అంటావ్ ? జరిగిం దంతా నావల్లే జరిగిం దంటావా ?

ఉషా: ఎవ్వరివల్లనైనా జరగనివ్వండి; ఇక యీ యింట్లో నేను వొక్క క్షణం ఉండదలచలేదు.

అరు : ఎక్కడికి వెళ్తావ్ ?

ఉషా: నాఇష్టంవచ్చినచోటుకి. ఇక ఈఇంట్లో నాకేముంది! ఇప్పటికైనా నా బ్రతుకు నన్ను బ్రతకనివ్వండి. (ముందుకి అడుగువేస్తుంది.)

అరు : ఉషా... (అడ్డుతాడు)

ఉషా: నన్ను అడ్డకండి.

అరు : నామాట విను ఉషా...నేను నీ శ్రేయస్సు కోసే చెప్తున్నాను... బాబుని నువ్వెంత ప్రేమించావో, నేనూ అంత ప్రేమించాను.

ఉషా: బాబు సంగతి ఎత్తకు. బాబుని నువ్వు ఏనాడూ ప్రేమించ లేదు బాబుని నువ్వెప్పుడూ ప్రతిబంధ కంగానే చూశావు ... ఆ ప్రతిబంధకం నీకిప్పుడు లేదు ... ఇక ఈ ప్రతిబంధకం మాత్రం ఎందుకు ? నన్ను వెళ్ళనివ్వు.

అరు : ఏమి టీమాటలు ఉషా !

ఉషా: నీకు మాటలుగానే ఉంటై. వుండవుమరీ...శీలో పాసన అనే నెపంతో ఇంకా నన్నెంతకాలం మోసం చేద్దాం అనుకున్నావు ! నే నీ ఇంట్లో ఏవిధంగా బ్రతుకుతున్నానో, తింటున్నానో, తినటంలేదో నీకు

పట్టించీ! నీకు జరగవలసినవన్నీ సక్రమంగా జరిగితే చాలు; అన్నీ సమయానికి అమర్చిపెడితేచాలు; ఇక నాతో నీకుపనేముంటుంది? నేను నీ వంటలక్కని. నీకు కావలసిన వస్తువులన్నీ వొత్తే దాసీని. బానిసని. ఇక నీవో; స్వేచ్ఛాజీవివి. ఆకాశాన విహరించే విహంగమవు... విశృంఖలంగా ప్రవర్తించే హక్కు గలిగిన కళాస్రష్టవు... ఇదేగా నీ దృష్టి... ... ఈ బ్రతుకు బ్రతికిందానికంటె, బలవంతంగా చావటమే మేలు... నన్ను వెళ్ళనియ్యి...

అరు: ఉషా, నీకు తెలియదా నామనస్సు! నిన్ను నా భాగ్యదేవతగా చూసుకున్నానే! నువ్వుచేసిని ప్రతి పనినీ నేను అంగీకరించానేగాని, ఏనాడూ నిన్ను శాసించిఎరుగనే!! నేను నిన్ను అవమానపరచాలని పరిచానా ఉషా? లేదు... నామాట నమ్ము దేవీ.

ఉషా: దూరంగా ఉండండి! నన్ను ముట్టుకోకండి. మెత్తని మాటలూ, తియ్యని ఊహలూ, ఉదాత్తమయిన ఆశయాలూ నమ్మి మోసపోవటానికి నేను అభం శుభం తెలియని ఉషనికాదు; నేనిప్పుడు పుత్రశోకం అంటే ఏమిటో తెలుసుకున్న తల్లిని. మీరిక నన్ను మోసం చెయ్యలేరు. మీబోటి వంచకులతో, క్రూరులతో కాపరం చెయ్యటంకంటె వీధుల్లో బిచ్చంఎత్తుకోవటం మేలు. ఆవృత్తి ఎంత శోచనీయం అయిందైనా అందులో స్వాతంత్రత వుంది. ఒకరికి ఆత్మని అమ్ము కొని బ్రతకవలసిన అవసరం లేదు. కుళ్ళి కృశిస్తూ

పైకి మెరుగులు నటించవలసిన అవసరం లేదు...
నేను వెళ్తున్నాను.

సునం: ఉషాదేవీ, నామాట ఒక్కటికి వింటావా?

ఉషా: వినను. వినవలసిన అవసరం లేదు. స్నేహితురాలవనీ, సంస్కారివనీ, ఉత్తమ ఆశయాలు కలదానివనీ నిన్ను నమ్మినందుకు నాకు తగిన శాస్తి జరిగింది. ఇక నేను మీకు అడ్డు ఉండను. స్వేచ్ఛగా మీ సరదాలన్నీ తీర్చుకోండి.

భారంగా నిష్క్రమిస్తుంది... అరుణకుమార్ గానీ, సునంద గానీ, ఆమెను అడ్డగించలేక పోతారు; నిర్విణ్ణులై చూస్తుంటారు. ఆమె కనబడకుండా వెళ్లగానే అరుణ ఆక్రోశిస్తాడు.

అరు : ఉషా! వెళ్ళిపోయావా? నన్ను శూన్యంలోకి అగాధంలోకి త్రోసి వెళ్ళిపోయింది నా ఉష... ఇంత దండనకు నే నేం తప్పు చేశాను సునందా?

సునం: ఆమెను నువ్వు చిత్రాలనుంచి మానుకొని ఇంటిపనిని చెయ్యనీయవలసింది కాదు అరుణ్.

అరు : నీకు తెలియదా సునందా? నేను చెయ్యమన్నానా?

సునం: ఒకవేళ ఆవిడే ఆవిధంగా నిశ్చయించుకున్నా నీవు గట్టిగా చెప్పి వొప్పించవలసింది...

అరు : ఆవిడ ఇష్టప్రకారం పోవటమే మంచి దనుకున్నాను సునందా......సునందా ... ... చివరికి మనిద్దరి స్నేహాన్ని కూడా అపార్థం చేసుకుంది ... నన్ను క్షమించు సునందా? (వొడిలో తల పెట్టుకొని

వెక్కి వెక్కి ఏడుస్తాడు... సునంద అతని తల నిమురుతూ రెండు కన్నీటిబొట్లు రాలుస్తుంది.)

సునం: అరుణ్... ఊరుకో... ఇది మంచికే వొచ్చిందేమో!

## అయిదవ రంగం : పశ్చిమవాహిని.

నది తన ఉరవడిలో తన్ను తాను మరచిపోయి పర్వతాన్ని ఢీకొనబోయి ఢీకొన్నది. తన శరీరాన్ని అణువుల క్రింద చీల్చుకొని తపనతో చిందులు త్రొక్కింది. తనలో తాను ఆలోచించుకొని, తన్ను తాను వశపరచుకొని, పశ్చిమానికి తిరిగి అంతులేని లోతులను సృష్టించుకొని ప్రశాంతంగా గంభీరంగా ప్రవహించటం మొదలు పెట్టింది.

* * *

ప్రొడక్షను ఆఫీసు. రిహార్సల్ స్రగడి. ఉషాదేవీ, డైరెక్టరూ వుంటారు

డైరె: నాకు తెలుసు ఉషాదేవీ, ఈ విధంగా జరుగుతుందనీ.. ఈ కవులంతా abnormal పీపులే... ప్రతికవికీ కొంత కొంత పైత్యం ఉంటుంది. ఆ పైత్యాన్ని మనం తెలివి అనుకొని మిస్టేక్ అవుతాం. తీరా దగ్గరకు వెళ్ళిచూస్తే అసలు రంగు క్లియర్‌గా కనుపిస్తుంది.

ఉషా: మీకు తెలుసుగా, డైరెక్టరుగారూ; నేను అరుణని ఎంత గాఢంగా ప్రేమించిందీ.

డైరె: ఒక్క గాఢమేనా ఉషాదేవీ... ... నీ లైఫ్‌నే అతని కోసం శాక్రిఫైస్ చేశావు. అబ్బాయీ, ఇల్లూ, మగడూ... నిన్నుచూస్తేనే నాకు పిటీ వచ్చేది. బిట్టర్ పిటీ.

ఉషా: అరుణ్ ఇలా చేస్తాడనుకోలేదు. ఎన్నో ఊహించుకున్నాను ... నా ఊహలన్నింటినీ చిదిమివేసి, నన్నిట్లా నిరాధారం చేశాడు.

డైరె: అలా బాధపడకు ఉషాదేవీ... నేను ఉన్నంతకాలం నీకు నిరాధారం ఏమిటి? (ఉషాదేవి కన్నీళ్ళలోనుంచి చూస్తుంది అర్థం చేసుకోటానికి) చూడు... నేను నీకు ఫాదర్ లాంటివాణ్ణి. ఇప్పటికైనా మించిపోయింది లేదు. నిన్ను హాల్ ఇండియాలోకల్లా ఫస్టు ఎడ్యుకేటెడ్ ఫిల్మ్‌స్టారుని చేస్తాను; నువ్వు నేను చెప్పినట్టు వింటే...

ఉషా: నేను చిత్రాలకింకా ఏంపనికి వస్తాను? అరుణకుమార్ సేవలో నా చేతులన్నీ కాయలు కాసిపోయినయ్... మొహమంతా ముడుతలు పడిపోయింది. నా బాబు, నా బాబుని కోల్పోయి హృదయం ముక్కలు ముక్కలై వుంది. ఏడ్చి ఏడ్చి కన్నులు చిల్లులు పడినై. అభిమానం కొద్దీ మీరు అంటారుగాని నేనింకా చిత్రాలకు పనికివస్తానా డైరెక్టరుగారూ! ముక్కలైన ఈ హృదయాన్ని, పెట్లిపోతున్న ఈ నరాలను నేను మళ్ళీ సరిచేసుకొని మానవరూపాన్ని పొందగలనా? మనిషిని కాగలనా? (ఏడుస్తుంది.)

డైరె: ఊరుకో ఉషాదేవీ-ఊరుకో... ...ఈ ఇండస్ట్రీలో నాకున్న ఇరవయ్యేళ్ళ అనుభవంలో ఇటువంటి విషమ విషాద ఘట్టాలను ఎన్నింటినో చూశాను.

ఒక్కొక్కప్పుడు ఇటువంటి ఎక్స్‌పీరియన్సెస్ అన్నీ మనమంచికే జరుగుతుంటాయి.

ఉషా: నాకింకా మంచేమిటి? నాకిక మంచిజరగనక్కర్లేదు. మంచుని అనుభవించే శక్తి నాకిక లేదు.

డైరె: అలా అనుకోవద్దు. పర్హాప్స్ ఇవన్నీ మీకొక కెరియర్ నిర్దేశించబడటానికి జరుగుతూ వుండవచ్చు. చూడు ఉషాదేవీ నీ కల్చర్, నీ నాలెడ్జి, నీ టాలెంట్స్ ఇవన్నీ చూచి నిన్ను ఏమేమో చేద్దాం అనుకున్నాను. నా ఈ ఐడియా, వన్డర్‌ఫుల్ ఐడియా ఆచరణలోనికి రాగలందులకు గాను ఇవన్నీ జరుగుతున్నాయేమో! నువ్వు రాబోయేముందే పన్నెండు లక్షలు ఖర్చు పెట్టి బ్రహ్మాండమైన సెట్టింగ్స్‌తో ఒక సూపర్ ప్రొడక్షన్ అండర్ టేక్ చేద్దామని ఆలోచిస్తున్నాను. అందులోకి అరేబియానుంచి గుర్రాలనూ, ఆఫ్రికా నుంచి భల్లూకాలనూ, హాలీవుడ్ నుంచి ఆ దేవో కోతి వుందే దాన్ని తెప్పిద్దాం అనుకుంటున్నాను. అలా ఆలోచిస్తూ కూర్చుంటే ఒకదాని తర్వాత ఒకటీ, ఒకదాని తర్వాత ఒకటీ ఈఆలోచనలన్నీ దొంతర్లు దొంతర్లుగా వచ్చి పడ్డాయి. నీవుఅంగీకరిస్తే అందులో నీకు పార్టనర్‌షిప్ ఇద్దాం అనుకుంటున్నా...

ఉషా : నాకెందు కివన్నీ...?

డైరె : అలా అనకండి మరి... మీకూ ఏదో వ్యాపకం వుంటే మంచిది మీరేమీ డబ్బు పెట్టక్కర్లేదు. మీ సటసరకు ఇవ్వవలసిన డబ్బుని షేరుగా కన్వర్టు

చేసుకుంటాను. మిగిలిన విషయాలన్నీ నేను చూసు
కుంటాలెండి - మీరట్లా చూస్తూ కూర్చుంటేచాలు
—బోయ్

బోయ్:(ప్రవేశించి) సార్.

డైరె: కాఫీ పట్టుకురా. రెండుకప్పుల స్ట్రాంగ్ కాఫీ... వెరీ
వెరీ స్ట్రాంగ్.

బోయ్: యస్ సార్.

నిష్క్రమిస్తాడు.

డైరె: (తనలో) వన్డర్ ఫుల్, వన్డర్ ఫుల్, అతివన్డర్ ఫుల్.

*　　　*　　　*

ఔట్ డోర్ షూటింగుకని సముద్ర తీరానికి వస్తారు, ప్రొడక్షన్
యూనిట్ కి చెందినవారంతా డైరెక్టరుకీ ఇతరప్రముఖులకూ
మూడునాలుగు టెంట్స్ నిర్మించబడివున్నాయి. అందులో వొకదానిలో
ఉషాదేవి వుంటుంది. ఉషాదేవిని మార్చుకోసం, మంచి మూడ్ లో
పెట్టటానికీ, డైరెక్టరు ఆహ్వానించి అక్కడకు తీసుకొని వచ్చాడు.
ఉషాదేవి వెనకవున్న కిటికీలోనుంచి సముద్రం అలలను చూస్తూ
వుంటుంది. పనిమనిషి రత్నం తన రెండేళ్ళ కొడుకుని చంకలో
ఎత్తుకొని ప్రవేశిస్తుంది.

రత్నం: కాఫీ చెయ్యమంటారా అమ్మగారూ.

ఉషా: వొద్దు.

వెంటనే రత్నం గొంతులో వొక పిక్చూలియారిటీ పసికట్టి వెనుదిరిగి
చూస్తుంది. రత్నం మామూలు పనిమనిషే. ఆ సెంటులో ప్రత్యేకత

ఏమీ లేదు ... కాని ఆమె చంకనఉన్న చంటివాడు ఆకర్షించాడు ఉషాదేవిని.

ఉషా: రత్నం!

రత్నం: అమ్మా.

ఉషా: ఇలా దగ్గరకు రా.

రత్నం ఉషాదేవి దగ్గరకు అడుగులు వేస్తుంది. ఉషాదేవి పిల్లవాడిని ఇంతంత కన్నులు చేసుకొని చూస్తుంది.

ఉషా: నీకొడుకేనా రత్నం?

రత్నం: అవును అమ్మగారూ.

ఉషా: ఎంచక్కగా వున్నాడే!

రత్నం: అచ్చగా ఆచచ్చినాడి పోలికే అమ్మగారూ.

ఉషా: వాడెవడే?

రత్నం: వాడే, వీడి అబ్బ.

ఉషా: ఇక్కడ కనపడడే.

రత్నం: వీడు కడుపున పడింరోజే పోయిండు. ఇంతదాకా అయిపు లేదు.

ఉషా: నీకు దిగులుగా ఉండదా రత్నం?

రత్నం: దిగులెందుకమ్మగారూ ... ... వాడిమానాన వాడు పోయిండు. దిగులుండిమాత్రం చేసేదేంది అమ్మగారూ?

ఉషా: నిజమే అనుకో ... ... ఎందుకని విడిచిపెట్టి పోయాడు! ఏమన్నా పోట్లాడుకున్నారా?

రత్నం: పోట్లాట ఏముంది అమ్మగారూ. ఏదో గుబులు పుట్టింది-పోయిందు.

ఉషా: ఏడీ ఇట్లా ఇవ్వు...

రత్నం: ఈ సచ్చినాడిదీ ఆసచ్చినోడి గుణమే అమ్మగారూ- సంక యిడవడు... వెళ్ళరా...

పిల్లవాడు ఏడుస్తాడు.

ఉషా: పోనీలే... ఇదుగో, ఈ అయిదురూపాయలూ తీసుకొని వాడి కేమన్నా కొనిపెట్టు! (డబ్బు ఇస్తుంది.)

రత్నం: వొద్దు అమ్మగారూ!

ఉషా: పరవాలేదు లేవే! తీసుకో.

రత్నం: (తీసుకొని) కాఫీ పట్టుకొస్తా...

ఉషా: ఇప్పుడు వద్దు... కావలిస్తే నేనే చెపుతాను...

రత్నం పిల్లవాడితో లోపలకు వెళ్తుంది. ఉషాదేవి మళ్లీ ఆలోచనలో పడుతుంది. కిటికీనుంచి అలలవైపు చూస్తూ నిలబడి వుంటుంది. కళ్లు చెమ్మగిలుతై. డైరెక్టరు చీరెలు మొదలైన అనేక వస్తువులు కొను క్కొని, వాటెడునిండా అమర్చుకొని ప్రవేశిస్తాడు ... కిటికీదగ్గర ఉన్న ఉషను చూస్తాడు.

డైరె: హల్లో, ఉషాదేవీ.

అసలే తనపిల్లవాడి తలపులతో బాధపడి పోతున్న ఉషాదేవి భారంగా తిరిగి చూస్తుంది. డైరెక్టర్ని అతని చేతులలోవున్న వస్తువులనూ చూచి ఖిన్నురాలవుతుంది. ఏవేవో జ్ఞాపకాలు ఆమెను ముసురుకుంటై. భారంగా ఎక్కడనుంచో మాట్లాడుతున్నట్లు అంటుంది.

ఉషా: అవన్నీ ఏమిటి?

డై రె : నీకోసమే తెచ్చాను ఉషాదేవి. షూటింగు త్వరగా క్లోజ్ చేసి కారు వేసుకొని సరాసరి సిటీకివెళ్ళి కొని తెచ్చాను. (ఉషాదేవి విచారంగా ఉండటంచూచి) చూడు, ఉషా నువ్వు దిగులుగా వుంటే నేను చూడలేను. జరిగిందేదో జరిగిపోయింది ..అదంతా ఒక బాడ్ డ్రీమ్, అంతే...

ఉషాదేవి కన్నీరు తుడుచుకొంటూ మళ్ళీ కిటికీ వైపుకి తిరుగుతుంది. డైరెక్టరు తన చేతుల్లో వున్న వస్తువులను సోఫామీద పెట్టి ఆమెదగ్గరకు వెళ్ళాడు.

డైరె : ఉషా

ఆమె పలకదు.

డైరె : ఇటు చూడు (బుజాలు పట్టుకొని తన వైపుకి త్రిప్పు కుంటాడు) నో... నో... నో వీపింగ్...

ఉషా : అన్నివిధాలా దిక్కులేని దాన్నయ్యాను,

డై రె : అదేం మాట! ఈ నీ డైరెక్టరు ఉండగానే అంత మాటా!

ఉషా : మీరు నిజంగా నన్ను ఆపదలో ఆదుకున్నారు. మీ మేలు ఎలా తీర్చుకోగలను !!

డై రె : నువ్వు కన్నీరు కార్చకుండా ఉంటే చాలు. (గడ్డం పట్టుకొని తల పైకెత్తి) ఫ్యూచర్ లోకి చూడు ఉషా! వన్డర్ ఫుల్. అతి వండర్ ఫుల్. నీవు నటిగా హోల్ ఇండియాలో నేమ్ తెచ్చుకుంటావు. నేను డైరెక్ట రుగా హోల్ వరల్డులో పేరు తెచ్చుకుంటాను. మళ్ళీ

మనిద్దరం బిజినెస్‌లో పార్ట్నర్స్‌మి. వన్డర్‌ఫుల్, అతి వండర్ ఫుల్.

ఉషా: నాకేమీ అర్థం అవటంలేదు.

డైరె: ఇందులో అర్థం ఏముంది? ఉషారాణీ... ఉషా... నా ఉషా... ...

ఉషాదేవి పెళ్లగిలి వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక పోతుంది... అకస్మాత్తుగా అతని రొమ్ము మీదపడి తల ఆన్చి ఏడుస్తుంది.

ఉషా: మిమ్మల్ని నమ్మాను.

డైరె: నో, నో. నోవీపింగ్ ... చూడు... నాకళ్ళల్లోకిచూడు. పిచ్చిపిల్లా... ఎందుకీ వీపింగ్ హోల్ వరల్డ్‌లో...

ఉషా: మీఇష్టం. నన్నెలాదిద్దుకుంటారో... ...

హఠాత్తుగా ఇంట్లోనుంచి 'అమ్మా!' అనే ఏడుపూ, ... 'బాబూ! నాబాబూ!!' అనే రోదన వినిపిస్తయ్ ... బాకుతో పొడవబడిన మనిషికిమల్లే 'ఆఁ!!...బాబూ' అని పెద్దపెట్టున కేకవేసి ఉషాదేవి నిలువుగుడ్లువేసి నిలబడిపోతుంది. 'నాబాబే!!...అది నాబాబు కంఠ ధ్వనే!!...బాబూ'!! అని రోదిస్తుంది. డైరెక్టరుకి అర్థంకాక బిత్తరిచూపులుచూస్తూ నిలబడివుంటాడు. లోపలనుంచి బిడ్డనెత్తుకొని ఏడుస్తూ రత్నం ప్రవేశిస్తుంది. పిల్లవాడు గిజగిజ తన్నుకుంటూ ఏడుస్తుంటాడు.

రత్నం: చూడుబాబయ్యా... నేను ప్రక్కన కూర్చోబెట్టుకుని మీ అన్నంకోసం గోధుమలు దంచుతున్నా... ... ఎప్పుడుపెట్టాడో చెయ్యిపెట్టాడు. నేనుచూడలా— (ఏడుస్తుంది.)

డై రె : అయ్యయ్యో... వేళ్ళన్నీ నలిగిపోయినై. ఏదీ... ఏదో వొకగుడ్డ (ప్రక్కనున్న గుడ్డచించి కట్టుకడు తుంటాడు. ఉషాదేవి ఒక్కక్షణం రక్తం మరకల్లో వున్న బిడ్డనుచూస్తుంది. తనబిడ్డ మరణదృశ్యం ఆమె స్మృతిపథానికి వస్తుంది. వెర్రివెత్తినట్లు అవుతుంది. బయటకు రివ్వున పరుగెత్తుతుంది.)

డై రె : (కట్టుకడుతూ) ఎందుకింత అశ్రద్ధ? బిడ్డని కేర్ ఫుల్ గా చూడలేనిదానివి ఎందుకు కనవలసివచ్చింది! ! ... ఇక డాక్టరుదగ్గరకు తీసుకు వెళ్ళు... ... థా థ్యాంక్ లెస్ జాబ్.

*                *                *

సముద్రతీరం. ఆత్మహత్య చేసుకుందామనే ఉద్దేశంతో ఇసుకలో భారంగా నడుస్తుంటుంది, ఉషాదేవి ... నడవలేక నడవలేక నడిచి తూలి పడిపోతుంది ... ఒక్కొక్కటిగా పూర్వవృత్తాలు ఈవిధంగా మనస్సులో కెలుకుతై.

అరు : చిత్రం గొప్పతనానికి మీరేకారణం.

ఉషా: కాదు మీరే.

అరు : మీరలా అంటే నేనేంచెప్పగలను?

ఉషా: వొప్పుకుంటే సరిపోయె.

అరు : మరి కారణం మీరుగా!

ఉషా: కాదు మీరు.

అరు : ముమ్మాటికీ నేనుకాదు.

ఉషా: నుమ్మాౖటికీమోనె[illegible]

కిలకిల నవ్వులు.

ఉషా: అరుణ్ ? అరుణ్ ?

అరు : ఉషా ?

ఉషా: ఎక్కడ ?

అరు : ఇక్కడ ?

ఉషా: ఎక్కడో చెప్పవూ ?

అరు : ఇక్కడే...

ఉషా: ఎక్కడ ?

అరు : నీ హృదయసీమలో

ఉషా: అరుణ్ ?

అరు : ఉషా ?

ఉషా: నీవుఎక్కడ వున్నదీ తక్షణం చెప్పాలి.

అరు : తెలుసుకోలేవూ ?

ఉషా: ఎలా తెలుసుకోగలను ?

అరు : నా కంఠధ్వనివల్ల.

ఉషా: నీకంఠధ్వని ఎక్కడనిగుర్తుపట్టేను. ఒకప్పుడు ఇక్కడ అక్కడ-అక్కడ-ఇక్కడ. తోటంతా నీకంఠధ్వనే వినిపిస్తూవుంది నాకు... ఎక్కడున్నావు అరుణ్.

అరు : నీ పాదాలచెంత దేవీ.

*    *    *

అరు : ఉషా నీకు తెలియదా నా మనస్సు? నిన్ను నా భాగ్యదేవతగా చూసుకున్నానే, నువ్వు చేసిన ప్రతి పనినీ నేను అంగీకరించానే గాని, ఏనాడూ నిన్ను శాసించి ఎరగనే. నేను నిన్ను అవమాన పరచాలని పరిచినా ఉషా! లేదు నా మాట నమ్మి దేవి...

పడిపోయిన ఉషాదేవి, వేదనల సంక్షోభంతో నెమ్మదిగా కదులుతుంది. మూరంగా అరుణకుమార్ సునందలు ప్రవేశిస్తారు. అరుణకుమార్ పడివున్న ఉషాదేవిని చూస్తాడు... (ఉషా!) అని గుండెలు ప్రీలిపోయే ట్టు అరిచి ఆమె దగ్గరకు పరుగెత్తుతాడు.

అరు : (ఒడిలోకి తీసుకొని) ఉషా?... దేవీ ? ఒక్కసారి నీ రెప్పలు ఆర్చు. నీ పెదిమలు కదుల్చు... దేవీ... నా ఉషా...

ఉషా : (అపస్మారకంగా) అరుణ్ ? ... అరుణ్ ?

అరు : ఏం దేవీ!!!

ఉషా : నిన్నెంత అపార్థం చేసుకున్నాను అరుణ్.

అరు : లేదు ఉషా, లేదు...

ఉషా: నిన్నెంత అన్యాయం చేశాను?

అరు : అయ్యో! నాకు నువ్వు అన్యాయం చెయ్యటం ఏమిటి ఉషా... ...మల్లెపూవువంటి నిన్ను కఠిన హస్తాలతో నలిపి నలిపివేశానే!!

ఉషా: బాబు మన్నకు ప్రాప్తంలేదు...నీదేముంది అరుణ్... నేను నిన్ను నిందించానుకదూ!! ఎంత నొచ్చుకున్నావో! వెన్నకంటే మెత్తనిదే నీ మనసూ ...

అరు : సునందా ఏం చెయ్యను? నా మనస్సును ఏవిధంగా విప్పిచెప్పను!

ఉషా: నీ ఆధారం పోయింతర్వాత నీ ప్రభావం తెలిసింది అరుణ్... నీ ఆధారం లేకపోతే నే నెంత పతనం అయ్యేదాన్నో నా కిప్పుడు తెలిసివచ్చింది...

అరు : ఉషా! ఉషా! నీ అరుణ్ణి ... ఒక్కసారి చూడు ఉషా... ఉషా !!

ఉషాదేవి నెమ్మది గా కళ్ళు తెరిచిచూస్తుంది. అరుణకుమార్ ని గుర్తుపడుతుంది.

ఉషా: అరుణ్ ... వచ్చావా అరుణ్ ... నన్ను క్షమించు అరుణ్ ...

కావిలించుకొని గుండెలమీద తల ఆన్చి ఏడుస్తుంది.

అరు : ఉషా? ఏవమ్మా... ఇప్పటికి కలిగిందా నామీద నీకు దయ! (తల నిమురుతూ అంటాడు) సునందా, నా దేవి నన్ను క్షమించింది... నన్ను చేరింది... ఇక జీవితంలో మాకు ఎడబాటు అనేది వుండదు సునందా!!?

డైరక్టరు హడావిడిగా ప్రవేశిస్తాడు. అరుణ కుమార్ ఒడిలో ఉష ఉండటం చూస్తాడు.

డై రె : ఛా థ్యాంక్ లెస్ జాబ్.

వెనుతిరుగుతాడు.

* * *

నదిలో ఇంతకుముందున్న శక్తులన్నీ [illegible]యి. కాని సంఘర్షణల ప్రభావంవల్ల వైరుధ్యం నశించి సమన్వయం కుదిరింది. ఇప్పటి నది తన శక్తులను తనలోనే ఇముడ్చుకొని గంభీరంగా, వయ్యారంగా ప్రవహించటం మొదలుపెట్టింది. ఏది అడ్డువచ్చినా, పర్వతం మొదలుకొని చిల్లపెంకువరకూ, ఏది అడ్డువచ్చినా, దానికి ప్రదక్షిణం చేసినట్టు తొలిగిపోయేదేగాని, మహోద్రేకంతో ఢీకొనేదికాదు. దానిని జాలిగా, ప్రేమగాచూచి, తన చిరుకెరటాలతో అతి ఆప్యాయంగా స్పృశించి తనదారిని తాను పోయేది. ఈ ఆర్ద్రత గండ శిలలను కూడా కరిగించింది. పర్వతాలుసైతం తమ హృదయాలను కోసి ఈ మహానదికి దారినిచ్చినై. ఈమహానది సర్వాన్నీ తనలో ఇముడ్చుకొని సర్వానికీ అతీతమైన అందాలనూ, ఆనందాలనూ దారిపొడుగునా విరజిమ్ముతూ ప్రవహిస్తోంది—అనంతంగా.

— □ —

# మబ్బుతెరలు

## పాత్రలు :

| | |
|---|---|
| శివసుందరం | కమల |
| నీలకంఠ శాస్త్రి | సరోజ |
| నారాయణరావు | రామాయమ్మ |
| ... ... | నిర్మల |

---

నారాయణరావు ఇల్లు. ఇల్లు అట్టే పెద్దది కాదు. కాని అందంగా అలంకరించబడి వుంటుంది. నారాయణరావు అంతకుముందే బయటనుండి వచ్చాడు. కోటు వంకెకుతగిలించి సోఫాలో కూర్చొని చెల్లెలు కమలతో మాట్లాడుతుంటాడు.

కమల : ఏమిటన్నయ్యా ఇది?... నువ్విట్లా పట్టించుకోకుండా చూస్తూ వూరుకుంటే ఎట్లా చెప్పు? ఇల్లన్న తర్వాత, మొగవాడివైన తర్వాత, ఇంట్లో ఏం జరుగుతూ వుందో కొంచెం గమనిస్తూ ఉండాలి. ఆడవాళ్ళమీద విడిచిపెట్టిన ఇల్లెక్కడైనా బాగుపడుతుందా అన్నయ్యా?

నారాయణ : ఇప్పుడు మళ్ళా కొత్తబెడద ఏమి వచ్చిపడింది కమలా?

కమ : ఏం చెప్పను అన్నయ్యా?... చెపితే 'అత్తవారిల్లు విడిచి ఇక్కడ వుంటుందికాక, ఇంట్లో పోరుపెడుతూ

వుంది' అని నువ్వెక్కడ అనుకుని పోతావోఅని వొక ప్రక్క భయం. చెప్పకపోతే... (గాద్గదికం)

నారా: అదేమిటమ్మా... నిన్ను గురించి నేనేమన్నా అనుకోవటమా? ఏం మాట అది? ఆ మాటకొస్తే నువ్వేమన్నా, ఏం చేసినా నేనేమీ అనుకోను. అది సరే కాని ఏం జరిగిందో చెప్పు... ...

కమ : ఇంతకీ భగవంతుడు కన్నవారింట్లో పడి ఉండమని నా నుదుట వ్రాశాడు... నా గీతే బావుంటే, వారికి మలప బుద్ధులు పుట్టేవే కావు... నేనూ అందరికిమల్లే నిక్షేపంగా కాపురం చేస్తుండేదాన్ని... వొదినెకీ బాధా వుండేది కాదు-

నారా: వొదినె ఏమన్నా అన్నదా ఏమిటి?

కమ : నోటితో అంటుందా అన్నయ్యా-నువ్వో నేనో అయితే కడుపులో వున్నదంతా వాగేస్తాం... అందరూ మనలాంటివాళ్ళే ఉండరు - ప్రపంచంలో.

నారా: అది నిజమే... కాని ప్రతి ఒక్కరూ అందర్నీ కలుపుకు పోవాలిగా కమలా? లేకపోతే ఈ ప్రపంచం ఒక్క క్షణం సాగదు.

కమ : అందుకని వదినె ఏమన్నా పడి ఉండ మంటావా అన్నయ్యా?

నారా: అదికాదమ్మా! నా ఉద్దేశం. వదినకూడా నిన్ను కలుపుకోవాలి ... అసలు ఇంతకీ ఏం జరిగిందో చెప్పావుకాదు...

కమ : చూడన్నయ్యా ... నీకు చెప్పకపోతే ఎవ్వరికి చెప్తాను? ఒక తల్లి బిడ్డలం. నీకు కష్టంవస్తే నాకు చెప్పుకోవాలి; నాకు కష్టం వస్తే నీకు చెప్పుకోవాలి.

నారా: అవును కమలా ... ఏకోదరులం అయింతర్వాత అనురాగం అన్నది వుండనే వుంటుంది.

ఇంట్లోనుంచి రామాయమ్మ

రామాయమ్మ: కమలా ! కమలా !

కమ : వొస్తున్నా అమ్మా !

రామా: ఒకసారి త్వరగా ఇటు రా అమ్మా ...

కమ : ఇదుగో వచ్చేస్తున్నా ... అన్నయ్యా ... నేను నీకూ వదినకూ మధ్య తగాదాలు పెడుతున్నానని అనుకోకు ... మన అమ్మ కడుపున పుట్టినవాళ్ళకు అటువంటి బుద్ధులుండవు ... ... నిన్న ఉదయం బయలుదేరి వెళ్ళావు ! ఇప్పుడు వస్తున్నావు ... ఈలోగా ఏం జరిగిందీ నీకేం తెలుస్తుంది ?

నారా: నువ్వు చెప్పినా తెలియకపోదుగా కమలా.

కమ : చూడన్నయ్యా ? ... నిన్న నువ్వట్లా వెళ్ళావు ... వదిన ముస్తాబు చేసుకుని ఇట్లా బయటకు వెళ్ళింది. మళ్ళీ ఎప్పుడు వచ్చిందనుకున్నావ్ ? మేము ఎదురు చూచి, ఎదురుచూచి భోజనాలు ముగించుకొని పడుకోబోయే సమయానికి వచ్చింది.

నారా: అంతేగదా ! బహుశా స్నేహితుల ఇంటికి వెళ్ళి వుంటుంది.

కమ : కాదన్నయ్యా! అట్లా అయితే నేను నీతో ఎందుకు చెప్పేదాన్ని... ఎవడో వూళ్ళోకి ఒక కవి వచ్చాడట. ఏం కవో! ఏం పాడో... గోష్ఠి పెట్టాడట - గోష్ఠి - అందులో కూర్చుంది.

నారా: అయివుంటుంది. నీకు తెలుసుగా కమలా, నీ వదినకు సంగీత సాహిత్యాలంటే ఇష్టమని.

కమ : ఇష్టం అయితేమాత్రం ఇంత విడ్డూరమా అన్నయ్యా ...చీకటి పడేదాక అతనితో కూర్చుంటుందా? పోనీ కూర్చుంటే కూర్చుంది. తనకు నిన్నటివరకూ అతని ముక్కూ మొహం తెలియదుగదా! అతగాడ్ని ఇంటికి భోజనానికి పిలవటం ఎందుకు చెప్పు...

నారా: ఇవాళ భోజనాలా ఏమిటి? చెప్పవ్! —— రానియ్ కమలా. అతన్ని నేనుకూడా చూస్తాను. వీలైతే నాలుగు పద్యాలు చదివించుకొని విని ఆనందిద్దాం.

కమ : అయితే ఇందుకా నీకివన్నీ చెప్పింది అన్నయ్యా! నీసంగతి తెలిసి తెలిసి చెప్పటం నాదే బుద్ధితక్కువ. కాపురం రచ్చకెక్కుతుంటే చూస్తూ ఉండబట్టలేక చెప్పాను.

రామా: (ఇంట్లోంచి) కమలా! కమలా!

కమ : నువ్వూవూరుకోఅమ్మా... వస్తున్నాను ... అందరూ నన్ను వేధించుకుతినేవారే——ఇంతకీ ఏనాడు అత్తవారిల్లు విడిచివచ్చానో, ఆనాడే అందరికీ లోకువైపోయాను. (ఏడుస్తుంది)

నారా: ఊరుకో కమలా... నేను నిన్నిప్పు డేమన్నాను ?

కమ : ఇంకేమనాలి ? నేను చెప్పేవన్నీ విన్నావు... చివరికి నన్నే ఆటలు పట్టిస్తున్నావు...

నారా: లేదు కమలా, నా ఉద్దేశం అది కాదు... ...నీ వదినె చదువుకున్నది. చిన్నప్పట్నుంచీ పదిమందిలో తిరిగిన మనిషి... పైగా సంగీత సాహిత్యాలంటే, ఆమె ఈ ప్రపంచాన్నే మరిచిపోయే స్వభావంగలది. ఎవ్వరికి తెలియని సంగతి ఇది ! అందుకని కవిని ఏదో భోజనానికి పిలిచివుంటుంది. దానికి నీవింత గొడవపడటం ఎందుకూ, అనే నేను అనేది?

కమ : అయితే నీకు చెప్పడం తప్పనేగా నువ్వనేది?

నారా: నా ఉద్దేశం అదికాదు కమలా ! నువ్వు కొంచెం నిదానించి ఆలోచించు.

కమ : ఇంకా ఆలోచించేది ఏమిఉన్నదిలే అన్నయ్యా !

రామా: (ఇంట్లోనుంచి) కమలా !

కమ : అదిగో మళ్ళీ... ఒక్క క్షణం ఊరికినే కూర్చోనివ్వదు. ఏ అమ్మో కన్నదాన్ని చేసినట్లు అన్నిపనులూ నామీదే రుద్దుతుంది.

వంటింట్లోనుంచి రామాయమ్మ ప్రవేశిస్తుంది.
పూర్వకాలపు మనిషి. నిండు మనిషి.

రామా: నువ్వెప్పుడొచ్చావురా అబ్బాయి ?

నారా: ఇప్పుడే వచ్చానమ్మా.

రామా: వచ్చినవాడివి వొక్కసారి లోపలకన్నా రాకుండా ఇక్కడే కూర్చున్నావేం!

నారా: కమల ఏదో చెప్తుంటేనూ వింటూ కూరున్నాను. సరోజ ఎక్కడ?

రామా: ఆయనెవరో వస్తారుటగా అబ్బాయీ భోజనానికి! నాకు సహాయం చెయ్యటానికని పొయ్యిదగ్గర కూర్చుంది. అదేమిటో ఎక్కడ నేర్చుకుందోరో, ఏ పనైనా ఇట్టే చిటికెలో చేసేస్తుంది. నాకిన్నేళ్లు వచ్చినై, దానికి తెలిసినన్ని వంటకాలు నాకూ్కడా తెలియవు.

కమ : సరేలే, ఊరుకో. నీకోడలిసంగతి నువ్వూ, నీసంగతి నీ కోడలూ పొగుడుకొంటూ వుంటే, మధ్యవాళ్ళం వినలేక చస్తున్నాం.

రామా: ఏమోరా అబ్బాయి... నాకీగొడవ లన్నీ తెలియవు.. ఇవ్వాళ... ఆయన... పేరేదో చెప్పింది.

కమ : పేరు కేంలే... పేరు వినడానికి బాగానేవుంది... ... శివసుందరం అట. . .శివసుందరం.

రామా: ఆ! అదే... ఆయన్ని 'భోజనానికి పిలిచినాను అత్తయ్యా... బాగా చేసిపెట్టాలి' అన్నది. నేను 'సరేలే' అన్నా ... మీ నాన్న వున్న రోజుల్లో కూడా ఇట్లానే ఎవ్వరినో పిలుస్తూనే వుండేవారు... నాకు చాతనయినట్టు చేసిపెడుతూనే ఉండేదాన్ని. . .అదిగో అదే వస్తూ వుంది.

సరోజ ప్రవేశిస్తుంది. అతి సున్నితమైన విగ్రహం. ప్రతి కదలికలోనూ నిర్మలత్వం ఉట్టిపడుతూ వుంటుంది. మొహంలో ఆనందం తొణికిసలాడుతూ వుంటుంది. దేనికీ అందని చూపులు.

సరోజ : ఎంతసేపైందండీ వచ్చి?

నారా: ఇంతకుముందే సరోజా.

సరో : మీరెక్కడ సమయానికి రారో, ఎక్కడ ఆలస్యంగా వస్తారో అని చాలా కంగారు పడ్డాను... శివసుందరం గారని పేరు మీరు వినే వుంటారు...

కమ : అన్నయ్యకు ఈ పేర్లన్నీ ఎక్కడ తెలుస్తాయిలే వదినా? ఏదో ఉద్యోగం చేసుకొని, నాలుగురాళ్లు సంపాదించుకొని, పొట్టపోషించుకునే వాడికి.

రామా: ఎందుకే అట్లా మాట్లాడతావు?

కమ : నీకట్లాగే వుంటుందిలే... ప్రతిదానికీ కోడల్ని వెనకేసుకు రావటం వొకటి తెలుసు. అంతకంటే మించి నీకు ఒక్కసంగతి తెలియదు.

సరో : తప్పు నాదే అత్తయ్యా ... ఏదో కళాసేవకుడు ... అటువంటివాళ్ళ పరిచయం ఉండటం మనకైనా మంచిదేగదా అని భోజనానికి రమ్మన్నా... వదినెకు ఇష్టం ఉండదనుకుంటే పిలిచేదాన్నే కాదు.

రామా: భోజన్నానికి పిలిస్తే తప్పేముందే?

కమ : నువ్వూర్కో అమ్మా! నీకేం తెలుసు బయట జరిగే పనులన్నీ...

రామా: ఏమోనమ్మా... ఈ గొడవలన్నీ నాకు తెలియవు... పొయ్యిమీద కూర మాడుతుందేమో! నే వెళ్తా. (వెళ్తుంది)

నారా: అసలీ కవి ఎవ్వరు సరోజా?

కమ : ఎవ్వరు భోజనాలకు పిలుస్తారా అని ఎదురు చూసే ఒకానొక వ్యక్తి అన్నయ్యా...

నారా: ఎందుకు కమలా, ప్రతిదానికీ అట్లా అపార్థం తీస్తావు?

నాను : నేను అపార్థం తీసినా తీసినదాన్నే, తీయకపోయినా తీసినదాన్నే...భర్త ఇల్లు విడిచి ఎప్పుడైతే వాకరి పంచన బ్రతకటం మొదలుపెట్టానో, అప్పుడే అందరికీ లోకువైపోయాను. (ఏడుస్తుంది)

నారా: మాటి మాటికీ ఎందుకిట్లా మనస్సుని కష్టపెట్టు కుంటావు...

కమ : ఇంకా నన్ను అంటున్నావా అన్నయ్యా? ... ఏదో నీ మంచీ, కుటుంబంమంచీ కోరి చెప్పా...'ముక్కూ మొహం ఎరగని వాళ్ళని ఇంటికి భోజనానికి పిలవటం ఎందుకూ 'అన్నా. అందులోనూ సమయానికి నువ్వు వస్తావో, రావో తెలియకపోయె. ఉన్న ముగ్గురం ఆడవాళ్ళ మయిపోతిమి ... ఇందులో తప్పేముంది?... అసలు ఆడదానికి పరాయి మొగా డితో పాత్తేమిటి? ఏమో బాబూ, మేము ఎరగం ఇటువంటి పను లెన్నడూ! (విదిలించుకుంటూ ఇంట్లోకి వెళ్తుంది.)

సరో : నాదే తప్పయింది.

నారా: ఒకవిధంగా తప్పే సరోజా... ఏదన్నా ఒకపని చేసే టప్పుడు, 'ఇంట్లోవాళ్ళందరూ ఏమనుకుంటారా' అని ఆలోచించాలి ... నలుగురం కలిసి ఒక కుటుంబంలో ప్రశాంతంగా బతకాలిఅంటే, బతకడంలో ఎంతో నేర్పుఉండాలి. నువ్వేమీ అనుకోకపోతే ఒక సంగతి చెబుతాను.

సరో : చెప్పండి...

నారా: నాకు కళాసేవఅన్నా, కళాసేవకులన్నా అంత ఇష్టం లేదని నీకు తెలుసు. అయినా నీకు ఇష్టంగనక, నీ మనస్సును కష్టపెట్టడం ఎందుకని, నువ్వేమిచేస్తున్నా చూస్తు వూరుకుంటున్నాను. ఈసంగతి నీకు తెలిసిందే! అంత సానుభూతితోనూ నువ్వు ఇంట్లోవున్న ఇతరుల సంగతికూడా ఆలోచించాలిగా సరోజా ?

సరో : వదినెకు ఇంత అయిష్టమని నేను ఊహించలేక పోయాను.

నారా: అదిపోనీ... ... ఈయనతో నీకు పరిచయం చాలా తక్కువ. నిన్న గోష్ఠిలో ఆయన పద్యాలు చదివితే నీవు విన్నావు. ఆ మనిషి మంచివాడో కాదో నాకు తెలియదు. మనిషి మంచివాడో కాదో తెలుసు కోకుండా, అతనితో పరిచయం పెంపు చేసుకోవడం ఎందుకుచెప్పు ?

సరో : ఆయన చాలా మంచివారంటే ... మంచివారు కాక పోతే, ఆయన మనస్సు ఎంత నిర్మలమో కాకపోతే, అంత రసవత్తరమయిన కవిత్వం ఎలా వ్రాస్తారు?

నారా: ఇదే నీతో వచ్చేచిక్కు సరోజా? నాకు స్నేహం కాకపోయినా, నేనూ చాలామంది కవులను ఎరుగుదును. వారు తాము వ్రాసిన పుస్తకాల్లో వెలిబుచ్చే ఉన్నత భావాలకూ, నిత్య జీవితంలోని వారి చర్యలకూ ఏమీసంబంధంవుండదు. వారికవిత్వాన్ని చదివి ఆనందించవచ్చు. నేను కాదనటంలేదు. కాని వారిని దగ్గరకు రానివ్వటంమాత్రం నిప్పుతో చెరలాడటమనే నా ఉద్దేశం.

సరో : నాకంతా అయోమయంగా వుంది.

నారా: నువ్వు వొట్టి తొందర మనిషివి. లోకమంతా నీలాంటిదే అనుకొని ప్రవర్తిస్తావ్.

సరో : నేను ఆయన కవిత్వం విన్నంతసేపూ ఈలోకాన్నే మరచి పోయాను. ఆయనదగ్గరకు వెళ్ళి, 'మాయింటికి ఒకసారి రండి' అని పిలిచేవరకూ ఆగలేకపోయాను. పిలిచాను... మీరుకూడా ఇలా అనుకుంటారనుకుంటే ఒక్కనాటికీ పిలిచేదాన్ని కాదు.

నీలకంఠశాస్త్రి: (ప్రవేశిస్తూ) నారాయణరావూ! ... సరోజ కూడావుందే... ఏదో భార్యాభర్తలు మాట్లాడుకుంటూ ఉన్నట్లున్నారు...

నారా: ఏవో ఉబుసుపోక కబుర్లు.

సరో : నమస్కారం శాస్త్రిగారూ!

నీల : నమస్కారం అమ్మా...

సరో : ఇలా కూర్చోండి.

నీల : కూర్చుంటాలే అమ్మా... నేనేం పరాయి వాడినా మర్యాదలు చేయడానికి?

సరో : పెద్దవారు...

నీల : ఎక్కడైనా పెద్దవాణ్ని గాని, నీదగ్గరమాత్రంకాదు, నువ్వు అలా కూర్చో... నేనిలా కూర్చుంటాను... నేను నిన్న రెండు మూడు సార్లు నీ కోసం వచ్చాను నారాయణరావు.

నారా: నేనేదో పని వుండి తిరుగుతున్నాను శాస్త్రీ.

నీల : నేనూ అదే అనుకున్నా... నిన్న నువ్వుకూడా ఇంట్లో లేనేవమ్మా?

కమ : (ప్రవేశిస్తూ) నిన్న వదినకు తీరికెక్కడ?

నీల : అన్నిపనులూ చేసుకుపోయే భర్త వుండగా అంతతీరని పని నీకేం పడిందమ్మా!

కమ : ఊళ్ళోకి ఒక కవి వచ్చాడు గదండీ...

నీల : కవా?

కమ : కవే!! శివసుందరం అట.

నీల : వాడా!

నారా: మీరు ఎరుగుదురా ఏమిటి?

నీల : ఎరక్కపోవడమేమిటి? వాడి మేనత్తకొడుకునేగా నేను. వాడు చిన్నప్పటినుంచీ వొట్టి పోకిరిసన్యాసి.

నిన్న పార్కులో కనిపించి వాడిసొదంతా వినేవరకూ వదల్లేదు.

కమ : అంత సొదేమి వెళ్ళబోసుకున్నాడు?

నీల : వాడిధోరణికి ఒకదారి ఉంటేగా?

కమ : చెప్పండి. కన్నుల కబుర్లకి మా వదినె చెవికోసుకుంటుంది. ఏంవదినా...

నారా: చెప్పు శాస్త్రీ!

నీల : ఆఁ ఎందుకూ-పుణ్యమా? పురుషార్థమా?

నారా: పోనీ మేముడుగుతున్నామనయినా చెప్పు.

నీల : ఏంలేదోయ్ నారాయణరావు. ఈఊళ్ళో ఒక అందమైన యువతి వుందట. ఆమె తనంటే పడి చస్తుందట. తను ఎక్కడికి వెళ్తే అక్కడికి నీడలా వెన్నాడుతుందట. చూచినవాళ్ళేమనుకుంటారో అని తను చచ్చిపోతున్నాడట. 'నీకిది తగదమ్మా' అని ఎంత చెప్పినా ఆ యువతి వినదట.

కమ : మరి అంతగా తిరగడానికి ఆమెభర్త వూరుకుంటాడా?

నీల : ఆమాట కూడా చెప్పాడట కమలమ్మా .. దానికి 'మాఆయన వొట్టి అర్భకుడు, నేనేం చేసినా ఆయన అనుమానపడడు. మీకూ కవిత్వంమీద ఇష్టం వుండి మీతో తిరుగుతున్నాను అనుకుంటాడు, సంతోషిస్తాడు' అని చెప్పిందట.

సరోజ: శాస్త్రిగారూ. మీరు చెప్పేవన్నీ అబద్ధాలే.

నీల : అదేమిటమ్మా!

సరోజ: నేను ఆయన్ని ఎరుగుదును. ఆయన స్త్రీమూర్తిని మాతృదేవిగా పూజిస్తాడు. దేవతగా ఆరాధిస్తాడు. ఆయన నోటివెంట ఇటువంటి మాటలు ఎన్నడూ రావు.

నీల : (నవ్వి) అదేమిటే సరోజా! వాణ్ణి నేను ఎరగనట్టు చెప్తున్నావ్? వాడు స్త్రీమూర్తిని పూజిస్తాడూ? ఆరాధిస్తాడూ? వాడు గతసంవత్సరమేగా పెళ్ళి కాని ఒకపిల్లని, ఇంచుమించు పెళ్ళిపీటలమీదనుంచే...

సరో : ఊరుకోండి... మీరు పెద్దవారు... ఇటువంటిమాటలు మీనోట వింటూంటే, నాకే అవమానంగా వుంది.

కమల: నీకెందుకు అంత వుక్రోషం వదినా?

నారా: ఆయన విన్నది చెప్తున్నాడు.

నీల : అంతకంటే నాకేం ఉద్దేశం ఉంటుంది?

కమల: ఆ కవినిగురించి ఉన్నది ఉన్నట్లు తెలుసుకోటానికి కూడా, వదినెకు యిష్టం ఉన్నట్లు లేదు.

సరోజ ఈ సూటీపోటీ మాటలను భరించలేక ఇంట్లోకి వెళ్తుంటుంది.

నారా: వెళ్తున్నావేం సరోజా?

సరో : నన్ను వెళ్ళనివ్వండి.

నీల : నే చేసిన తప్పేముంది?

సరో : ఈ లోకంలో స్త్రీగా పుట్టడమే తప్పు. స్త్రీ తన ఇష్టానికి అనుకూలంగా బ్రతకటమే తప్పు. అసలు ఇష్టం అనేది ఏర్పరచుకోవటమే తప్పు... ఇంతకంటే తప్పేం కావాలి?... శాస్త్రిగారూ! మీరేదో పెద్ద

మనుష్యులూ, మా కుటుంబ శ్రేయస్సు కోరేవారూ అనుకున్నాను. ఇంత దుర్బుద్ధికి పాల్పడతారనుకో లేదు. (కన్నీరు రాలుస్తూ ఇంట్లోకి వెళ్తుంది)

నీల : ఇదేమిటి నారాయణరావు ? నే నేమన్నాను ?

నారా: ఆ కవిని సరోజ ఈపూట భోజనానికి రమ్మని పిలిచింది శాస్త్రి.

నీల : ఆఁ !

కమల: ఆకవి అన్నవన్నీ తననిగురించే నని అనుమానపడుతూ వుంది కూడాను.

నీల : అయ్యయ్యో...ఎంతపని జరిగింది ! నాకీ గొడవలన్నీ తెలియనే తెలియవు. ఏదో వాడు అన్నమాటలన్నీ అమాయకంగా అనేశాను. నన్ను నువ్వే క్షమించాలి నారాయణరావూ!

నారా: క్షమించటానికి ఇందులో నీ తప్పేముంది శాస్త్రీ ? సరోజ నల్లనివన్నీ నీళ్ళూ, తెల్లనివన్నీ పాలూ అనుకుంటుంది ఆమెకు లోకవ్యవహారం తెలియదు. అందువల్ల ఇటువంటి చిక్కులన్నీ వొస్తుంటాయి.

నీల : మన అమ్మాయి సంగతి మనకు తెలియం దేముంది నారాయణరావు ?

నారా: నువ్వుకూడా భోజనానికి వుండు శాస్త్రీ.

నీల : నే నెందుకు ? నాకు తీరిక ఎక్కడ ? మా ఇంటి ప్రక్కవిడ భర్తా...

నారా: నువ్వుండాలి శాస్త్రీ...

నీల : బుజువులూ, గిజువులూ పెడతావా ఏమిటి ?

నారా: నువ్వు చెప్పిన మాటలు నమ్మినప్పుడుగా అవన్నీ.

నీల : చెయ్యి చేసుకుంటావా ఏం ఖర్మ !

కమల: అన్నయ్యకు ఒకపట్టాన కోపం రాదు; వస్తే బ్రహ్మ రుద్రులుకూడా ఆపలేరు.

నీల : ఇదిగో నారాయణరావు...

రామా: (ప్రవేశించి) ఒరేయ్ అబ్బాయి. ఏం జరిగిందిరా ?

నారా: ఏమీ లేదమ్మా...

రామా: ఏమీ లేకపోవటం ఏమిటి ? అది ఒక్కపెట్టున అట్లా మంచంమీద పడి కుళ్ళికుళ్ళి ఏడుస్తుంటే...

నీల : నువ్వు వెళ్ళు నారాయణరావు... నేను ఉద్దేశపూర్వకంగా ఏమీ అనలేదని సరోజతో చెప్పు... నన్ను క్షమించమను.

రామా: ఏమి జరిగిందేమిటి శాస్త్రీ ?

నీల : ఏంలేదు రామాయమ్మగారూ. ఏదో నలుగురు కలిసినప్పుడు అనేకమాటలు రాకుండా వుండవు చూడండి.

కమ : దానికే ఇంత ఎత్తున లేచింది. ఎవ్వరి నోటివెంటా మాటే రానివ్వదాయె ! ఏమీ అననివ్వదాయె !

రామా: పోనీలే అమ్మా; దాని స్వభావమే అంతని ఊరుకుంటే సరిపోయె ! నువ్వెళ్ళు నాయనా ; ఏవో నాలుగు ఓదార్పు మాటలు చెప్పిరా.

నారా: నువ్వొక్కడికే వెళ్ళకు శాస్త్రీ...

రామా: భోజనానికి ఉంటాడులే నాయనా.

నారాయణరావు ఇంట్లోకి వెళ్తాడు.

రామా: అసలు ఏం జరిగిందర్రా ?

కమ : నీకెందుకమ్మా ఇవన్నీ. నువ్వు లోపలకు వెళ్ళి పని చూసుకో.

రామా: అవున్లే అమ్మా, నాకెందుకు వచ్చింది ! పొయ్యి మీద పులుసు ఎక్కడ పొంగిపోతూ వుందో, చూసుకుంటాను. (ఇంట్లోకి వెళ్తుంది.)

కమల: (గుసగుసగా) బాగా నటించారండీ. తక్కిన రోగం కుదిర్చారు.

నీల : కాకపోతే, మొన్న నీతో మాట్లాడుతూ వుంటే, ఎంత అనుమానంగా చూస్తూ వెళ్ళిందో గ్రహించావా ?

కమ : దానికి మొదటినుంచీ మనమీద అనుమానమేనండీ.

నీల : ఇప్పుడు ఆట రక్తి కట్టిందిగా మరీ... ఇప్పుడేం చేస్తుంది ? మనమీద ఏమన్నా చెప్పినా ఇక నారాయణరావు నమ్మడు.

నిర్మల ఇంట్లోనుంచి ప్రవేశిస్తుంది. నిర్మల నారాయణరావు చెల్లెలు.

నిర్మల: వదినెక్కడ అక్కా ?

కమ : నువ్వేంటే, పానకంలో పుడకల్లే.

నిర్మల: ఈరోజు నామనసు తామరాకుమీది నీటిబొట్టువలె చలిస్తూ వుంది. నన్ను మబ్బుతెరలు క్రమ్ముకుంటున్నాయి.

ఏమి ఈ తెరలోని కలకలము !
దేవా తెర తీయగ రాదా !
ఈ కలకలమును
మాన్పగరాదా ?
ఏమి ఈ తెరలోని కలకలము !

కమ : నిర్మలా, ఏమిటే యీ పాటలు ?

నిర్మల: నీకు తెలియదా అక్కా ?

కమ : ఏమిటే తెలిసేదీ ?

నిర్మల: నేను పిచ్చిదాన్ని; నా పాటలూ పిచ్చివే.

కమ : నోరు ముయ్... పో యింట్లోకి.

*　　　*　　　*

లోపలగది. సరోజ ఏడుస్తూ పడుకొని ఉంటుంది; నారాయణరావు మాట్లాడుతుంటాడు.

నారా: సరోజా !

సరో : శాస్త్రిగారిని నే నెప్పుడూ గౌరవముగానే చూసేదాన్ని.

నారా: ఆమాట ఎవ్వరు కాదన్నారు సరోజా ?

సరో : మరి నన్నెందుకు ఇలా హింసించడం ?

నారా: అత నేమన్నాడు ?

సరో : ఇంకా ఏ మనాలి ?

నారా: విన్నమాట చెప్పాడు !

సరో : ఏమంటున్నారు ?... ఆయనమాటలు నమ్మారామీరు?

నారా: ...

సరో : చెప్పండి... మీరుకూడా నమ్మారా?

నారా: ఇందులో నమ్మకుండా వుండవలసింది ఏముందిసరోజా? అతను మనం అడిగితే చెప్పాడు ... ఆ కవి ఎవర్ని నిర్దేశించి ఆమాటలు అన్నాడో తెలియకుండానే చెప్పాడు... పైగా అబద్ధాలు చెపితే అతనికి వొరిగే దేముంది?

సరో : ఇక నే నేంచెప్పను?

నారా: నువ్వెందుకు బాధపడతావ్? ఇందులో నీ తప్పే ముంది?

సరో : ఇంకెవరిదండీ తప్పు నాదికాకపోతే! ... ఈసంఘంలో ప్రతిపనికీ అపార్థం కలిగించేవారు కొందరుంటారనీ, అందులో స్త్రీలై పుట్టినవాళ్ళు తమ కోర్కెలను... చివరికి తమ ఆనందాన్ని కూడా తమలోనే దాచు కోవాలిగాని, బహిర్గతం చేసుకోరాదనీ తెలుసుకోక ప్రవర్తించటం నా తప్పు కాదూ?

నారా: నువ్వు చేసినపని తప్పని ఎవ్వరూ అనటంలేదు సరోజా ... కాని ఆకవి మాత్రం మానవమాత్రుడుగా ప్రవర్తించలేదు. ఘోరరాక్షసుడిలా ప్రవర్తించాడు.

సరో : మీకు నేను చెప్పగలిగినదాన్ని కాదు... ఆయన అని ఉండరండీ-ఆమాటలు.

నారా: నాకు మనుష్యులసంగతి సరిగ్గా తెలియదు. అనే ఉంటాడు. పురుషులకు స్త్రీలను గురించి ఆవిధంగా చెప్పుకోవడం ఒక ఘనత... అలానే అతనూ చేశాడని

నేను అనుకుంటున్నాను. (చివరివాక్యం నారాయణ రావు తలవంచుకుని చెప్తాడు. సరోజ అతన్ని ఒక్క-క్షణం ఎగాదిగా చూస్తుంది.)

సరో : అయితే నాకొక సహాయం చెయ్యండి.

నారా: ఏమిటి సరోజా?

సరో : ఆయన్ని భోజనానికి రావద్దని ఇప్పుడే కబురు చేయండి.

నారా: వీల్లేదు. అతను భోజనానికి రావలసిందే...

సరో : ఏమంటున్నారు?

నారా: అతను భోజనానికి రావలసిందే అంటున్నాను.

సరో : ఎందుకు?

నారా: పిలిచాం గనక! భోజనానికి మనంతట మనం పిలిచి మళ్ళీ రావద్దని చెప్పటం గృహస్థధర్మమేనా? పైగా అతను ఎంతగా అవమాన పడతాడో! అతని కవితా హృదయం ఎంతగా బాధపడుతుందో?

సరో : ....... ... ...

నారా: మాట్లాడవేం సరోజా?

సరో : ఆయన మొహం నేనెట్లా చూడగలను?

నారా: ఏముంది ఇందులో. అతను వస్తాడు...పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ భోజనాలు ముగిద్దాం... తనదారిని తాను వెళ్ళిపోతాడు.

సరో : ఆపని నేను లేకుండా పూర్తిచేయండి.

నారా: నువ్వు లేకపోతే ఏం బావుంటుంది సరోజా? ఆహ్వా నించింది నువ్వాయె! అతను ఏమనుకుంటాడు? నువ్వు తప్పకుండా వుండాలి.

సరో : నామాట వినరూ!

నారా: అదేంమాట సరోజా! ... ఆయనవొచ్చి 'సరోజా దేవిగారు ఎక్కడ? సరోజాదేవిగారు ఎక్కడ?' అని అడిగితే నేనేం చెప్పేది?

సరో : సరోజ... చచ్చిపోయిందని చెప్పండి.

నారా: సరోజా! (సరోజని కోపంగా బాధగా చూస్తాడు. సరోజ అతని చూపులను భరించలేకపోతుంది. నెమ్మ దిగా తలవంచుకుంటూ మాట్లాడుతుంది.)

సరో : మరి నన్నెందుకిలా బాధపెట్టడం?

నారా: బాధేముంది సరోజా ఇందులో...?

సరో : పోనీ, వారిని రానివ్వండి. వొచ్చినవారిని వొచ్చినట్లు వెళ్ళనివ్వండి. ఈ సంగతులేమీ ఎత్తకండి. ఈ మాటలు వింటే ఆయన మనస్సు ఎంత క్షోభపడు తుందో నాకు తెలుసు.

నారా: ఎంతసేపూ ఆయన క్షోభసంగతితప్ప, నా క్షోభ సంగతి ఎందుకు ఒక్కక్షణం అయినా ఆలోచిం చవు... శాస్త్రి చెప్పిన మాటలకు నామనస్సు దహిం చుకు పోతూవుంది తెలుసా... అతను వొచ్చినప్పుడు నువ్వు తప్పకుండా ఉండవలసిందే! జరగవలసిన క్రతువంతా జరగవలసిందే.

నారాయణరావు కోపంగా గదిలోనుంచి బయటకు వెళ్తాడు. సరోజ చేతుల్తో ముఖం కప్పుకొని ఏడుస్తూ పక్కమీదకు ఒరుగుతుంది. నిర్మల ప్రవేశిస్తుంది.

నిర్మల: ఒదినా !

సరో : (కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, రాఅమ్మా రా ! ఇట్లా కూర్చో...

నిర్మల: ఇవ్వాళ నామనస్సు ఆగటంలేదు వదినా. చంద్రుని కోసం పరుగెత్తే సముద్రానికిమల్లే ఉరకలెత్తుతూ వుంది. ఎవరో, ఎవరో ఎక్కడికో పిలుస్తూ వున్నట్టు వుంది ఒదినా...

ఎవరోహో ! ఎవరోహో !!
నను పిలచునది;
నను తలచునది ;
ఎవరోహో ! ఎవరోహో ?
నా మనసును కలచునది ;
నా కోర్కెల ద్రుంచునది ;
ఎవరోహో ! ఎవరోహో !

బయట గాలి వాన హోరు.

* * *

మొదటి గది. నారాయణరావూ, నీలకంఠశాస్త్రీ, శివసుందరంకోసం ఎదురుచూస్తూ కూర్చునిఉంటారు...నీలకంఠశాస్త్రి ముళ్ళకంప మీద కూర్చున్నట్టు కూర్చుని వుంటాడు.

నీల : నేను ఉండి చేసేదేముంది నారాయణరావు నీ పిచ్చిగానీ... తలమీద బోలెడు పనులు పెట్టుకున్నవాణ్ణి... వాడు కబీ... అన్న సైముకి వస్తాడా ?

నారా: సరోజకోసమైనా వస్తాడు... పిడుగులు పడినాసరే...

బయట గుమ్మంలో కారు వచ్చి ఆగిన శబ్దం.

నారా: అదుగో రానే వచ్చాడు.

నీల : నువ్వు వుండు నారాయణరావు... నేను వెళ్ళి తీసుకు వస్తా... ఎంత చెడ్డ చుట్టం గదా!... నారాయణ రావు... నువ్వు ఋజువులకూ గిజువులకూ దిగకు... 'ఏదో చుట్టానివి గదా అని చెబితే... ఇంతపని చేశావా!' అని తరువాత ఏడుస్తాడు వాడు...

బయటునుంచి 'సరోజాదేవిగారూ... సరోజా దేవిగారూ' అని శివసుందరం పిలుస్తాడు.

నీల : వొస్తున్నానోయ్... నేను చెప్పిన సంగతి మరచి పోయేవ్ నారాయణరావు. (బయటకు వెళతాడు)

* * *

బయట గుమ్మందగ్గర, శివసుందరం నిలబడి వుంటాడు. నీలకంఠశాస్త్రి హడావిడిగా లోపలనుంచి ప్రవేశిస్తాడు.

నీల : ఓహో! శివసుందరం! రా! రా! రా...అట్లా చూస్తా వేమోయ్... నేను నీలకంఠశాస్త్రిని. నీ చుట్టాన్ని... మొన్న నిన్న పార్కులో చూశాన్లే... రా. రా.

శివ : నేను సరోజాదేవిగారికోసం వచ్చాను.

నీల : ఇది ఆమె ఇల్లే... నువ్వు వస్తావని చెప్పింది. నేను 'వాడు మావాడే' అన్నా... 'అయితే మీరు లేకుండా

ఎట్లా!' అంది... వచ్చా. 'మనలో మాట, ఆమె మనతో చెప్పకుండా ఏం చెయ్యదు లే... రా! రా!

ఇద్దరూ ఇంటి లోపలకు నడుస్తారు.

*　　　*　　　*

మొదటిగది. నారాయణరావు గంభీరంగా ఆలోచిస్తూ కూర్చుని వుంటాడు. నీలకంఠశాస్త్రి శివసుందరంతో హడావుడిగా ప్రవేశిస్తాడు.

నీల : శివసుందరమోయ్... ఈయన నారాయణరావు శివసుందరం... మన సరోజభర్త.

శివ : నమస్తే.

నారా: కూర్చోండి, మిమ్మల్ని భోజనానికి పిలిచానని సరోజ చెప్పింది. నేను చాలా సంతోషించాను.

నీల : మరి సంతోషమే... మావాడు పెద్దకవి. అటువంటి వాళ్ళతో పరిచయం చేసుకోవాలని ఎవ్వరికయినా ఉంటుంది.

నారా: మీరీఊరు ఇటీవలెవచ్చారని విన్నాను.

శివ : నే నీవూరు రావటం నిజంగా నాఅదృష్టం. నేనీఊళ్ళో అడుగు పెట్టినప్పటినుంచి ఆనంద తరంగాల మీద తేలి పోతున్నానంటే నమ్మండి.

నారా: ఎందుకో !!

నీల : అదేంప్రశ్న నారాయణరావు ? కవులకు అనేక ఆవేశాలు వొస్తూ పోతూవుంటై ...... వాటికన్నిటికీ కారణాలు చెప్పమంటే చెప్పగలుగుతారా ?

నారా: మీరీవూరు ఏదన్నా పనిమీదవచ్చారా? లేకపోతే_

నీల : చూడు నారాయణరావు-కవిని ఏపనిమీద వచ్చారు అని అడిగేకంటే ఏగాలికి కొట్టుకొచ్చారు? అని అడిగితే బాగుంటుంది.

శివ : ఒకవిధంగా...మీ పేరేమిటన్నారూ?

నీల : నా పేరే మరిచిపోయావూ? ...... నీలకంఠశాస్త్రి కాదటోయ్ నా పేరూ...

శివ : ఒకవిధంగా నీలకంఠశాస్త్రిగారు చెప్పినమాట నిజమే. కొందరు మిత్రులు రమ్మని పిలిస్తే...

నీల : (కమల లోపలనుంచి వస్తూంటుంది.) రా కమలమ్మా రా! ఈమె నారాయణరావుగారి చెల్లెలోయ్...

శివ : నమస్కారమండీ.

కమ : మాకు నమస్కారాలెందుకులెండీ... ఇంట్లోకూర్చుని పనిపాటలు చేసుకునేవాళ్ళకి! మేమేమి నీ టింగులకు తిరిగేవాళ్ళమా? కవిత్వాన్ని ఆనందించేవాళ్ళమా?

శివసుందరానికి అంతాఅయోమయంగా ఉంటుంది. తికమకపడిపోయి ఈవాతావరణంనుంచి తప్పించుకోవడానికి వేరు గత్యంతరంలేక—

శివ : సరోజాదేవిగారెక్కడ? (అని అడుగుతాడు)

నీల : వొస్తుందోయ్. (నారాయణరావుతో) మా శివసుందరం ఏది పట్టుకుంటే అదే నారాయణరావు. ఇప్పుడేకాదు, చిన్నప్పట్నుంచీ అంతే ... అదిగో సరోజ రానేవస్తూంది.

సరోజ అవనతవదనంతో ప్రవేశిస్తుంది. మూర్తీభ
వించిన శోక దేవతలా గుంటుంది, ఆమె ఆకృతి.

శివ : ఇదేమిటి సరోజాదేవిగారూ, ఇలా ఉన్నారేం ?

కమ : ఎలా ఉంది ? మామూలుగానే వుంది.

శివ : వెన్నెలలు విరజిమ్మే ఆ కళ్ళల్లో...

నీల : మీకవులదగ్గర ఉన్న గుణమేఇది. లేనిదాన్ని ఉన్నట్టూ; ఉన్నదాన్ని లేనట్టూ చూస్తూంటారు.

శివ : నాకేమీఅర్థం అవటంలేదు... నేను సరోజాదేవిగారు రమ్మంటే వచ్చాను...

నీల : రమ్మంటే వచ్చావు లేవోయ్ ...... రావొద్దంటే ఎవరొస్తారు ?

కమ : రావద్దన్నా వచ్చేటట్టున్నాడు ! !

శివ : నేను రావటం మీ కెవ్వరికి ఇష్టంగా వున్నట్టు లేదు.

కమ : మీరు వచ్చింది సరోజ పిలిస్తేగదా ! ఇక మా ఇష్టా నిష్టాలజోలి మీ కెందుకు ?

శివ : అది నిజమే... కాని ఇప్పటి ఆమె వైఖరి చూస్తే, వారికి కూడా నేను ఇక్కడకు రావడం ఇష్టంగా వున్నట్టు కనపడటంలేదు.

నారా: పిలిచినప్పుడున్న ఇష్టం. ఇప్పుడు పోయిందంటే ఈ మధ్యకాలంలో ఏదో జరిగివుండాలి.

శివ : ఏం జరిగింది ! ఏం జరగడానికి ఏముంది? సరోజాదేవి గారూ; మీరూ మాట్లాడరేం ? మీరు రమ్మని

ఆహ్వానిస్తే వచ్చాను. మీకళ్ళముందు జరుగుతున్న దంతా చూస్తున్నారుగా ... మాట్లాడ రేం ?

సరో : (వంచిన తల ఎత్తకుండా భూమిలోకి చూస్తూ) నన్ను క్షమించండి.

శివ : అదికాదు సరోజాదేవిగారూ! నన్ను పిలవటం ఎందుకు? ఈ సూటిపోటి మాట లనిపించటానికా ? మీ భర్త ఈమధ్య ఏదో జరిగిఉండి వుండవచ్చన్నారు. నాకూ అలాగే అనిపిస్తూ ఉంది. ఏం జరిగిందో చెప్పండి.

నారా: అడుగు సరోజా ?

నీల : అడగటానికి ఏముంది లే నారాయణరావు?...ఏదో మావాడు ఇంతదూరం వస్తుందని తెలియక ఏదన్నా అనివుంటే మనం క్షమించాలి.

కమ : కాకపోతే ఇంటికి పిలిచి, పోట్లాడి పంపిస్తామా ఏమిటి అన్నయ్యా ?

నారా: నేను వీరిని రానిచ్చిందే అందుకు. లేకపోతే సరోజ చెప్పినప్పుడే రావద్దని చెప్పేవాడిని.

శివ : సరోజాదేవిగారూ, నన్ను రావద్దని కబురు పంప మన్నారా ? దయచేసి ఇప్పటికైనా జరిగిన సంగతి చెప్పండి. ఇది భరించడం చాలా కష్టంగా వుంది.

సరో : నేనెవ్వరికే చెప్పుకోను ? ఇక్కడ నామాట వినే దెవ్వరు ?

కమ : ఆయన మనస్సు ఎక్కడ కష్టపడుతుందో అని వదినె అంత తహతహలాడిపోతూ ఉంటే మధ్య నీకెందు కన్నయ్యా ?

నారా: నాకు కాకపోతే ఇంకెవ్వరికి కమలా ? నా భార్యను అన్న మాటలన్నీ నన్ను అన్నట్లు కాదూ? నాభార్యను అవమానపరిస్తే ఒకటీనీ, నన్ను అవమానపరిస్తే ఒక టీనా ?

శివ : ఏమిటీ ? ! !

సరో : ఇంటికి పిలిచి ఈవిధంగా ప్రవర్తించడం మనకు ధర్మం కాదు.

నారా: ఆయనమీద ఉన్న నమ్మకం నీకింకా పోలేదన్న మాట. ఇంకా ఆయన గోష్ఠులకు వెళ్ళాలనీ, కలిసి తిరగాలనీ వున్నదన్నమాట ! మాట్లాడవేం ?

శివ : ఎందుకు ఆమెగారి నలా హింసిస్తారు ?

కమ : ఓహో ! ఇది మరీ బావుందే. భార్యాభర్తల మధ్య మీ కెందుకండీ. చూస్తూఊరుకుంటే వాళ్ళని కాపురం కూడా చెయ్యనిచ్చేటట్లు లేరే ?

సరోజ భారంగా అడుగులు వేసుకుంటూ ఇంట్లోకి వెళ్తుంటుంది.

నారా: వెళ్తున్నావేం సరోజా ?

సరో : నన్ను వెళ్ళనివ్వండి. మీకు పుణ్యముంటుంది.

నారా: ఆగు... ముఖ్యురాలివి. నువ్వు లేకపోతేఎట్లా? ... పోనీ నీకంత ఇష్టంలేకపోతే నేనే అడుగుతాను. ......శివ సుందరం గారు! మీరు పార్కులో... (నీలకంఠశాస్త్రి

లేచి గుట్టుచప్పుడు కాకుండా వెళ్ళే ప్రయత్నంలో వుంటాడు) ఎక్కడికి శాస్త్రి లేచావు ?

నీల : పని ఉంది ... ఇప్పుడేవస్తాను ... మా పిన్నత్తగారి కోడలు ఆస్పత్రిలో ఒక మొగశిసువును—

నారా: కూచో—ఇదేవో అంతు తేలనియ్, వెళ్దువుగాని—
(శాస్త్రి నిలబడిపోతాడు)

రామా: (ప్రవేశించి) ఇంకా కూర్చున్నారేంరా ? వంటంతా పూర్తయింది. సరోజా ! నువ్వెళ్ళి కాస్త మొహం కడుక్కుని బట్టలు మార్చుకోఅమ్మా ! — ఆయన రాగానే వడ్డించివేద్దాం.

నారా: ఆయన వచ్చేఉన్నాడమ్మా.

రామా: ఎవరు ?

నారా: ఇదిగో ఈయనే. (శివసుందరంగారిని చూపుతాడు.)

రామా: వచ్చావా నాయనా ? నాకోడలు—ఒకపెద్దకవి – పేరేదో జ్ఞాపకం ఉండిచావదు.

కమ : శివసుందరం ! !

రామా: ఆఁ అదే—ఒక పెద్దకవి, శివసుందరం అనే ఆయన వస్తున్నాడంటే, ఎట్లావుంటాడో అనుకున్నాను. నువ్వూ మాకు మల్లేనే ఉన్నావు—నేను వెళ్ళి వడ్డిస్తాగాని మీరు లేవండి నాయనా — ఇప్పటికే ఆలస్యమయింది. (ఇంట్లోకి వెళ్ళబోతుంది.)

నారా: చూడమ్మా నీతో ఒకసంగతి చెప్పాలి.

రామా: ఏమిటి నాయనా ?

నారా: సరోజకి వీరంటే చాలా ఇష్టం.

రామా: అది సహజమేగా నాయనా. ఈయన పెద్దకవి — దానికూడా కవిత్వంపిచ్చి కొద్దోగొప్పో వుంది. అటువంటప్పుడు ఒక పెద్ద కవి కనిపించినప్పుడు, ఏతమ్ముణ్ణో అన్ననో చూచినట్లుండటం సహజమే !

నాగా: నేను సరోజను ఏమీ అనడంలేదమ్మా ... కాని ఈయన ఆమె యిష్టాన్ని సాకుగాతీసుకుని పార్కులో ఒక పెద్దమనిషిఎదుట ఆమెను అనరాని మాటలన్నీ అన్నాడట.

శివ : అన్నీ అబద్ధాలే – నేనసలు పార్కుకే వెళ్ళలేదు... వెళ్ళని పార్కులో నేను ఎవ్వర్నీ కలవలేదు... ... సరోజాదేవిగారిని గురించి మాటలు అనడమా ! ఎంత విడ్డూరం ! ఆమెను నేను మాతృదేవిగా భావిస్తున్నానే ! ఆమెను చూచినప్పటినుంచీ నాజీవితాని కొక నూతనార్థం స్ఫురిస్తూఉందని ఆనందపడే నేను, ఆమెను మాటలు అనడమా ?

రామా: అయితే అబ్బాయి, ఆ పెద్దమనిషేవచ్చి నీతో చెప్పాడా ?

నారా: అవునమ్మా...

రామా: ఎవ్వరా పెద్దమనిషి నాయనా ?

నారా: ఇదుగో మన నీలకంఠశాస్త్రి... మన నీలకంఠశాస్త్రి ఆయన మేనత్త కొడుకేనట.

శివ : వట్టిది... నేను ఈయన్ని ఎరగనే ఎరగను. ఈయన్ని మొదటిసారిగా ఇక్కడే చూడటం.

నారా: (ఆశ్చర్యంగా) అయితే...

శివ : నాకు మేనత్త లేదు. లేని నా మేనత్తకు ఎవ్వరైనా కొడుకునని ముందుకు వస్తే, నేనేం చెయ్యగలను?

నారా: ఏం శాస్త్రి... మాట్లాడవేం?

శాస్త్రి గజిబిజి పడుతూంటాడు.

కమ : పోనీ, వేలువిడిచిన మేనత్తేమో!

శాస్త్రూ: మేనత్త వేలువిడవడమేమిటే! నీవొక గోలగాని.

శివ : అయితే నా తండ్రిపేరేమిటో చెప్పమనండి.

నారా: చెప్పు శాస్త్రీ...

నీల : నా...నాకూ (నసుకుతాడు) జ్ఞాపకం ... అంటే.

నారా: నీ తల్లి సోదరుని పేరు చెప్పటానికి నసుకుతావెందుకు?

నీల : నే... నే... నేను.

నారా: ఊం... నువ్వు!!

నీల : పేర్లు జ్ఞాపకం ఉంచుకోవడం... అందులో మొగవాళ్ళ పేర్లు....

రామా: ఎందుకురా అబ్బాయి ఆయనంత ఇబ్బంది పెడతావు? ఉన్నవాణ్ణి ఉన్నట్టు పేరు చెప్పమంటే, అది అంత తేలికపనా? పేరు పెట్టాలంటే దానికి కొంత ఆలోచన కావాలి, అతికేటట్టుండాలి. (శివ సుందరం వైపు తిరిగి) అయితే బాబూ మీ దేవూరు?

శివ : మాది శ్యామలాపురం అగ్రహారమండీ...

రామా: అది మా బావగారిఊరే.

శివ : వారి పేరేమిటండీ...?

రామా: శ్రీకంఠం పేరిశాస్త్రిగారని...

శివ : వారు మాకు దగ్గర బంధువులేనండి.

రామా: ఇంకేం? నువ్వు మాకు దగ్గర బంధువ్వే! (కొడుకుతో) చూశావా నాయనా! సరోజ పెద్దకవి అంటే ఎవరో అనుకున్నా... మనవాడే.

శాస్త్రి ఒణుకుతూ ఎవరూ చూడకుండా వెళ్ళిపోవడానికి ప్రయత్నిస్తూంటాడు.

నారా: శాస్త్రీ, ఎక్కడికి వెళ్తున్నావ్!

సీల : చెప్పేవీ, చెప్పకూడనివీ అనేక పనులుంటాయి నారాయణరావూ.

నారా: ఆగు...నువ్వు పెద్దమనిషివని ఇన్నాళ్లూ మేమందరం నిన్ను గౌరవించాం. సరోజ నిన్ను తండ్రితో సమానంగా చూచింది. ఇంతదారుణమైన పనికి ఎందుకు పూనుకున్నావ్? చెప్పు... ఊ ...మాట్లాండవేం?

చొక్కా పట్టుకుంటాడు.

రామా: ఊరుకో బాబూ. ఎందుకట్లా ఆయనమీద చెయ్యి చేసుకుంటావు...(శాస్త్రితో) నీకిక్కడినుంచి వెళ్ళి పోవాలని ఉందా నాయనా?

సీల : (ఒణుకుతూ) అవును... రామాయమ్మగారూ...

రామా: వెళ్ళేవాళ్ళని ఆపడం ఎందుకు నాయనా? వెళ్ళ నివ్వు...అది ఆయనకీ మనకీ అందరికీ మంచిది.

నారా: పో... ఇక మా గడప త్రొక్కావంటే చూడు ఏం చేస్తానో.

రామా: ఇక నువ్వు రమ్మన్నా రాడులే నాయనా. (ఒణుకు తున్న శాస్త్రితో) కాదు శాస్త్రిగారూ!

శాస్త్రి: ఇప్పటికి వెళ్ళనిస్తే ఇక రాను రామాయమ్మగారూ.

రామా: పాపం మొఖం చెల్లదు.

నారా: ఇంకా అట్లా ఒణుకుతూ గుడ్లప్పజెప్పి నుంచున్నావేం? పో. (నారాయణరావు మీదమీదకు వెళ్ళగా, ఒణుకుతున్న ధ్వనులు చేసుకుంటూ 'వెళ్తున్నా కమలమ్మా' — అంటూ శాస్త్రి వెళ్ళిపోతాడు. కమల బిత్తరపోయి కంగారుగా లోపలకు వెళ్తుంది.) ఎంత పాపానికి ఒడిగట్టాడు. పాముకి పాలుబోసి పెంచినట్టయింది. శివసుందరంగారూ, మీరు నన్ను హృదయపూర్వకంగా క్షమించాలి.

రామా: ఈ భాగ్యానికి క్షమాపణ లెందుకురా! వారుమాత్రం పరాయివారా ఏమిటి, ఇటువంటివన్నీ పట్టించు కోవడానికి... సరోజా – నువ్వెందుకమ్మా కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నావు?

సరో: వారిని వుండమని చెప్పానత్తయ్యా! పోనీ అన్నారని అంత అనుమానంగా ఉంటే రావద్దని కబురు చెయ్యమని చెప్పాను—నా మాట విన్నారు కాదు.

వారిని ఇంటికి రమ్మని పిలిచి నేరస్థుని నిలబెట్టినట్టు నిలబెట్టి అడ్డదిడ్డ ప్రశ్నలు వేయడం భావ్యమేనా అత్తయ్యా?

రామా: భావ్యంకాని మాట వాస్తవమేనమ్మా! కాని ఏం చేస్తాం? వాళ్ళంతే. ఈ ప్రపంచం యింకా నడుస్తూ ఉందంటే, అది ఆడవాళ్ళ నేర్పరితనంవల్లనే నని ఎప్పుడూ మరచి పోకమ్మా...

నారా: నాది పొరబాటే ... సరోజా నన్ను క్షమించు... ఈ గొడవే లేకపోతే శివసుందరం మన బంధువని తెలిసేదికాదు.—ఇదీ ఒకందుకు మంచిదే అయింది. కమల ఎక్కడ?

రామా: లోపలకు వెళ్ళిఉంటుంది. ప్రతి మానవుడూ ఈ బ్రతుకు ఆరాటంలోపడి స్వచ్ఛమైన తన మనస్సు మీద తెరలను వేసుకుంటూ ఉంటాడు. నా బిడ్డ మనస్సుమీద తెరతొలగేదెప్పుడో! రండి... అన్నం ఆరిపోతూ వుంటుంది.

నారా: రండి శివసుందరంగారూ. (సరోజతప్ప అందరూ లోపలికి వెళ్తూంటారు)

నిర్మ: (ప్రవేశించి) వదినా!

సరో: ఏం నిర్మలా?

నిర్మ: చంద్రుణ్ణి మేఘాలు కప్పివేస్తున్నట్టు నా ఆలోచనలు నన్ను కప్పివేస్తున్నాయి. తెరను తొలగించు కోవ

టంలో వున్న ఆనందం కొన్నాళ్ళు తెరలో కప్పబడి ఉంటేనేగా తెలిసేది వదినా ?

సరో : అవును, నిర్మలా అవును.

నిర్మ : నువ్వొక్కతవే వదినా నన్ను అర్థంచేసుకునేది. నన్నంతా 'పిచ్చిది' అంటారు. (సంతోషంగా) నా వదిన నా కంటే పిచ్చిది ! !

# గ్రుడ్డి సంఘం

## పాత్రలు:

| | |
|---|---|
| ప్రేక్షకులు | కవి శిష్యులు |
| హాలులో అమ్మకునేవాడు | సంఘ సంస్కర్త |
| సూత్రధారి | సంస్కర్త అనుచరులు |
| ముసలి | స్వాములవారు |
| కవి | స్వాములవారి శిష్యవర్గం |

---

అనాక స్టేజీ. హాలు ప్రేక్షకులతో క్రిక్కిరిసి వుంటుంది. నాటకం ప్రారంభించే గడువు దగ్గరకొస్తుంది. ప్రేక్షకుల్లో గుసగుసలు; గోలగా ఉంటుంది. 'సోడా సోడా' అనే కేకలూ, సోడాలుకొట్టిన ధ్వనులూ, 'గరంచా, బిస్కట్, పాన్' అనే కేకలూ వినిపిస్తూవుంటాయి. ...............

అమ్మకునేవాడు: (పెద్దపెట్టున) వేరుశనగలు, ఛిప్స్, వొట్టి శనగలు, పెప్పరమెంట్లు. ఏవి కావలిస్తే అవి...

ఒక ప్రేక్షకుడు: ఊరుకోవోయ్ — చెవిదగ్గిర నీగోలొకటి. (సోడాబుడ్డి కొట్టిన కీచుమనే ధ్వని.) రామ, రామ. నాటకం ఎట్లాఉంటుందోగాని, వీళ్ళతో చచ్చే గోజొచ్చింది ముందు.

కొందరు ప్రేక్షకులు: ప్రారంభించండయ్యా, ఇంకెప్పుడు ప్రారంభించేది? ఈ నల్లుల బాధ భరించలేకుండా

ఉన్నాం (ఒక చంటిపిల్ల పెద్దగా ఏడుస్తుంది) కాస్త పాలివ్వరాదుటమ్మా. మమ్మల్నిట్లా చంపకపోతే. పిల్లలకు టిక్కెట్టుండదనే ఆశకొద్దీ ఒకఆడది బయలు దేరితే పదిమందిపిల్లల్ని వెంటేసుకొస్తుంది.

'గరంచాయ్, బిస్కట్, పాన్' అనే పెద్ద కేక.

హామ్. భగవంతుడా, గజేంద్రుని ఆర్తనాదం విని అతన్ని రక్షించావంటావ్! నాటక ప్రేక్షకుల మొరలుమాత్రం ఆలకించవ్!

'షోడా షోడా' అని పెద్దపెట్టున షోడాకొట్టిన ధ్వని.

ఒక ప్రేక్షకుడు: (ప్రక్కవానితో) కవివేషం వేసే నటకుడు రాలేదట.

ప్రక్క ప్రేక్షకుడు: ఎందుకురాలే?

మొదటి ప్రేక్షకుడు: అతని కిస్తానన్న కిరాయి ఇవ్వలేదు. అందుకని వస్తానని ఎగ్గొట్టాడుట.

మరొక ప్రేక్షకుడు: ఎందుకయ్యా. అసలే చస్తుంటే లేని పోని పుకార్లన్నీ లేపుతారు. అతను రంగు పూసు కోవడం నేను కళ్ళారా చూసొచ్చాను.

కొందరు ప్రేక్షకులు: తెరలెత్తండయ్యా ... నాటకం ప్రారం భిస్తామంటారా; తెర చించెయ్యమంటారా? ఊ ... ప్రారంభించండి—

పెద్దపెట్టున గోలగా లేస్తారు. ఒకటి రెండు కుర్చీలు బెంచీలు విరగ్గొడుతున్న ధ్వనులు వినిపిస్తాయి.

సూత్రధారి: (స్టేజీముందుకు ప్రవేశించి) సోదర సోదరీమణులారా! మీరిలా గోలచేయడం తగదు. ఈ పట్టణం కళామతల్లికి పుట్టినిల్లని ఆంధ్రదేశమంతా అనుకుంటూ వుంటుంది. అటువంటి పట్టణ పౌరులైన మీరు ఇటువంటి సాహసకృత్యాలకు దిగడం తగిన పనికాదు. మా ఇబ్బందులుకూడ మీరు కొంచెం గమనించాలి.

ఒక ప్రేక్షకుడు: మా ఇబ్బందులు గమనించారుటయ్యా, మీ ఇబ్బందులు మేము గమనించడానికి. డబ్బు తగలేసుకుని మేం వచ్చి కూచుంటే తాపీగా కబుర్లు చెబుతున్నావు.

ఇంకో ప్రేక్షకుడు: మే మీ నల్లుల బాధ భరించలేకుండా వున్నాం మహాశయా, తమరైనా ఒకపద్యం అంటే కొంత ఉపశాంతిగా వుంటుంది.

మరొక ప్రేక్షకుడు: నువ్వెందుకయ్యా మధ్య. దిష్టిబొమ్మవి. మేము మీ ధర్మపన్నాలు వినడానికి రాలా. తెర ఎత్తించి నాటకం ప్రారంభిస్తావా; లేకపోతే...

ప్రేక్షకుల గోల.

ప్రేక్షకులు: ఈ కుర్చీలు, బెంచీలు మీకు దక్కవు. మీ మెడలమీద తలలుండవు. 'అలో లక్ష్మణా' అంటూ ఎవరి భార్యలదగ్గరికు వారు వెళ్ళి ఏడ్చుకోవలసిందే.

ప్రేక్షకుల్లో 'మొదలెట్టు', 'కానివ్', 'నువ్వులోపలికెళ్లు' అని గోల.

సూత్ర: దయచేసి మీరు దౌర్జన్యానికి దిగొద్దు. గోల ఆపండి... సద్దు మణిగితే ఒక్క నిముషంలో నాటకం

ప్రారంభిస్తాం. ఈ నాటకం మీరు మామూలుగా చూచేనాటకంకాదు. అంచేతని, మీరు శ్రద్ధగా చూడాలనీ, వినాలనీ...

ఒక ప్రేక్షకుడు: కళ్ళప్పగించిచూస్తాం, చెవులు నిక్కబొడుచుకొని వింటాం. ముందు కానీ...

సూత్ర: ఇదుగో నాటకం ప్రారంభమవుతోంది.

తెరబ్రదన పైకి వెళ్ళినధ్వని. బాక్‌గ్రౌండ్ మ్యూజిక్ ప్రారంభమవుతుంది.

ఒక ప్రేక్షకుడు: ఇదేదో మహారణ్యం సీనులాగుందే.

ఇంకో ప్రేక్షకుడు: మహారణ్యమైనా అయ్యుండాలి, ఏదైనా పూలవనమన్నా అయ్యుండాలి.

ఒక ప్రేక్షకుడు: ఎవరో తొంగిచూస్తున్నారు ఆ సైడ్ కర్టెన్ పక్కనుంచి.

ఇంకో ప్రేక్షకుడు: ఇంకెవరూ! పూర్వం బాగం మేళాల్లో ధర్మి అని ఉండేది. ఇప్పుడా పాత్రను నాటకాల్లో ప్రాంప్టర్ ధరించి మధ్య మధ్య తొంగి చూస్తూ వుంటాడు. అతనివల్ల ఏ అపాయమూ లేదు; మనకు ప్రయోజనమూ లేదు.

ఒక ప్రేక్షకుడు: ఇంకా ఏపాత్రా ప్రవేశించదేం, స్టేజీనంతా ఖాళీగా పెట్టి చూస్తూ కూచున్నారు ...... అదేమిటమ్మోయ్, స్టేజీ అంతా పొగ కమ్ముతూ వుంది.

ఇంకో ప్రేక్షకుడు: పైన చూశావా వెలిమబ్బు లెలా కమ్ముకుంటున్నాయో!

ఒక ప్రేక్షకుడు: ఓహో! ఇదేదో అంతా కొత్తరకంగా వుందే!

ఇంకొక ప్రేక్షకుడు: ఆ తెలిమబ్బులన్నీ ఏవిధంగా కేంద్రీకరిస్తున్నాయో చూశావా?

ఒక ప్రేక్షకుడు: ఒక మానవరూపాన్ని ధరిస్తున్నాయి.

ఇంకొక ప్రేక్షకుడు: స్త్రీ! స్త్రీ!!

ఒక ప్రేక్షకుడు: ముసల్ది! ముసల్ది!!

ఇంకొక ప్రేక్షకుడు: అదిగో స్టేజీమీదికి దిగింది. కర్రపోటు వేసుకుంటూ నడుస్తూవుంది...... ఎట్లావచ్చినపాగ అట్లా అంతరించింది ... ఎవరో ఈమె!! ఎక్కడో చూచినట్టుంది.

ఒక ప్రేక్షకుడు: ఊరుకోవోయ్. వెధవ నసుగుడు. ఏదో మాట్లాడబోతూవుంది. విను.

'బాక్‌గ్రౌండ్ మ్యూజిక్' ఆగుతుంది. స్టేజీమీద ముసలిది.

ముసలి: నేను సంఘాన్ని, మానవసంఘాన్ని, నన్నందరూ ఎరిగినట్లే, అర్థంచేసుకున్నట్లే మాట్లాడుతూ వుంటారు. కాని నా ఆకారాన్ని చూచిన వాళ్ళుకానీ, సరిగ్గా వూహించగలిగిన వాళ్ళుగానీ, ఒక్కళ్ళూ లేరు. ఎవరికివాళ్ళు తమ ఇష్టాఇష్టాలకు అనుకూలంగా నన్ను సృష్టించుకొని వ్యవహరిస్తూ వుంటారు. తాము అనుకున్న పనులు నెరవేరనప్పుడు నేను అడ్డమొస్తున్నానని నన్ను నిందిస్తారు. 'ఛంఘుం, పాడు సంఘం, ముదనష్టపు సంఘం' అని నిందిస్తారు. నేను గుడ్డిదాన్నంటారు. తాము అనుకున్న పనులు సాను

కూలపడితేమాత్రం అది తమ ప్రయోజకత్వమే నను కుంటారు. నాసహాయం ఏకొద్దిమాత్రం ఉన్నదని కూడా అంగీకరించరు. ఒకప్పుడు సైతాన్లు చేసిన పనులన్నీ టినీ నేడు – తెలివి కలవాళ్ళ మనుకున్నవారు నాకాపాదిస్తున్నారు. నిజానికి మానవుడు, నలిగిన బాటన నడవడం మంచిదని, పరిణామం వక్రగతికి వెళ్ళి మానవ ప్రయత్నం వృధాకాకుండా వుండ గలందులకు, నేను కృషిచేస్తూవుంటాను, ఇది కొందరు మానవులు గమనించరు. స్వలాభంకోసం, పరపీడన కోసం తాపత్రయపడే స్వార్థపరులు దీనిని సహించరు. అందులో తెలివిగలవాళ్ళ మనుకునేవాళ్ళే ముఖ్యులు.

స్టేజీలోపల అనతి దూరాన్నుంచి "జయీభవ, దిగ్విజయీభవ, గండభేరుండ, నిత్యరచనా దురంధర, కుకవిహృదయ విదారక గుడ్డిసంఘ నిర్మూలనా బద్ధకంకణ, ఇత్యాది బిరుదాంకిత శ్రీ శ్రీ శ్రీ కవిరాజా! జయీభవ! దిగ్విజయీభవ!" అంటూ స్తుతివాక్యాలతో "ఓం ఓహాం ఓహోహాం" అని కవిని ఒకపల్లకీమీద మోసుకుంటూ శిష్యబృందం ప్రవేశిస్తుంది.

ఒక ప్రేక్షకుడు: అదెవరోయ్ పల్లకీమీద రామపాదుకమల్లే కదలకుండా కూర్చున్నాడు!

ఇంకొక ప్రేక్షకుడు: అరె. అదేమ్మాట? అతనే మన రంగ మార్తాండ, రంగభీషణ, నాట్యకళోద్ధారక, కీచులాట ఆదిశేషయ్యగారు కవివేషంలో ప్రవేశిస్తున్నారు. ఆమోసుకొనివచ్చింది ఆయన శిష్యబృందం. ఆయన

పట్ల తమకున్న భక్తి గౌరవాలను ఈవిధంగా ప్రద ర్శించుకుంటున్నారు

ముసలిగుడ్డి: ఈ కవి నన్ను గుడ్డిసంఘమని నిందించేవాళ్ళలో ఒకడు. తన భావ విజృంభణను అడుగడుగునా నేను అడ్డుకుంటున్నానని ఈ కవి భ్రమ. ఈ కవి నన్ను గుడ్డిదానినిగా భావిస్తున్నాడు కనుక గుడ్డిదానిలాగే కనిపిస్తాను...

వి : పల్లకీ దించండి. ఈ ప్రకృతిని నేనొకసారి తిలకించాలి.

స్తుబృందం: జయీభవ. దిగ్విజయీభవ. (పల్లకీ దింపుతారు.)

వి : ఏమి ఈ ప్రకృతి రామణీయకత. నన్ను నిరంతరం ఆరాట పెడుతున్నట్టు గుడ్డి సంఘంతో పోల్చుకుంటే ఈ ప్రకృతి ఎంత ప్రశాంతంగా వున్నది. ఈపక్షుల కిల కిల రావాలు, ఈ పువ్వుల నవ్వులు, ఈ చిగురు టాకుల గుసగుసలు, ఈ సెలయేటి గానం హృద యానికి ఎంత ఆహ్లాదాన్ని చేకూరుస్తున్నాయి.

ఈ ప్రకృతి ఎంత ప్రసన్నవదన!
ఎంత ప్రశాంతచిత్త!!
నన్ను వెతపెట్టి బాధించు
గ్రుడ్డి సంఘముకన్న
ఈమె మనసు వెన్న
నే నిచట నున్న
ఎన్ని గ్రంథములను వ్రాయుదు!

లోకముపైకి
ఎన్ని భావములను విసురుదు!
ఎంత కల్లోలమును దెస్తు
నాదు స్వాతంత్ర్యము నరికట్టు
గ్రుడ్డి సంఘము కనులను
తృటిలోన తెరుతు!!

ముసలి: ఓమనిషీ!

నాకు పొడచుకొన్నను
కన్నులు కానరాకున్నవి
నేను గ్రుడ్డిదానను
పలువల ఊహాలకులోనై
స్వార్థపరుల చేరబడి
నే గ్రుడ్డిదాననైతి
నన్ను కరుణించి
నామీద దయయుంచి
ఒక్క కన్నీటి బొట్టు రాల్చుడయ్యా
నాదు మనసును
మెత్త బరచి
లోకములకు మంచిని
చేకూర్చుడయ్యా!

(ప్రేక్షకుల్లో కరతాళధ్వనులు.

కవి : ఎవరు నీవు?

ముసలి: నేనొక ముసలిదాన్ని బాబూ. పైగా గ్రుడ్డిదాన్ని.

కవి : నీవు గుడ్డిదానివైతే నీకు ప్రపంచం కనబడదు. సరే, నా త్రోవ కన్గొనడానికెందుకు ? నన్ను వెళ్ళనీ.

ముసలి: గుడ్డిదాని కేదిత్రోవో, ఏదికాదో ఎలా తెలుస్తుంది బాబయ్యా. మీరే దారిచూపిస్తే అటుబడి పోతాను. మరొకరొచ్చి అదీ త్రోవంటారు; మరొక దారి చూపెడతారు. ఆ త్రోవనుపడి పోతుంటే మరొకరు అడ్డువస్తున్నా నంటారు. చివరకు నా కేదారీ లేదు. గోదారే దిక్కు. నేను పుట్టినప్పటి నుంచీ దారులు వెదుకుతూనే వున్నా. ఇతరులు చెప్పిన దారిని అనుసరిస్తూనేవున్నా. చివరకు సుడిగుండంలా తిరిగినట్టు తిరిగి ఇక్కడికే వస్తున్నా.

ఒక శిష్యుడు: ఈ గుడ్డివాళ్ళందరికీ ఒకటే పాటలాగుంది కవిరాజుగారూ. మీకు జ్ఞాపకముందా గుడ్డిసంఘం, అదీ ఈ విధంగానే మాట్లాడుతూ వుంటుంది.

ముసలి: నాకదేమీ తెలియదు బాబయ్యా. కాటికి కాళ్లు చాచుకున్నదాన్ని; మీకు చిత్తమైతే ఒకరాగి డబ్బు పారేయండి.

కవి : డబ్బుసంగతి నాదగ్గ రెత్తకు. నేను ఇతరులదగ్గఱ పుచ్చుకునేవాణ్ణేగాని, ఇచ్చేవాణ్ణి కాను. తొలుగు దారి. మేం తొందరగా వెళ్ళాలి.

ముసలి: ఎందుకుబాబు, అంత తొందర ?

ఒక శిష్యుడు: ఓ ముసలిగుడ్డీ, మే మెవరమో తెలుసా నీకు ?

ముసలి: తెలియదుబాబు.

శిష్యుడు: మేము గండభేరుండ ... ...

ముసలి: మీ కెందుకొచ్చిన శ్రమ బాబు – మీరు చెప్పినా నాకు తెలియదు.

శిష్యుడు: అయితే విను. వారు కవిరాజులు, మేం కవిరాజుల శిష్యపరమాణువులం. మానవులకు పురోభివృద్ధిని కలిగించాలనే ఉద్దేశ్యముతో వెడుతున్నాం.

ముసలి: మంచిది బాబూ. తప్పకుండా వెళ్ళండి. అయితే ఆపని మీ రేవిధంగా చేయదలచారు ?

శిష్యు: ఈ కవిరాజులుంగారు పద్యాత్మకంగా భావబీజాలను వెదజల్లుతారు. శిష్యబృందమైన మేమంతా వారు వెదజల్లిన భావబీజాలను వాడవాడల్లా విత్తుతాం. ప్రజల హృదయాలను మార్చివేస్తాం. భూలోక స్వర్గాన్ని స్థాపిస్తాం.

ముసలి: నాబోటివాళ్ళకు కళ్ళుకూడా ఇప్పిస్తారా బాబూ ?

శిష్యుడు: బాగా అడిగావు. తప్పకుండా ఇప్పిస్తాం. ప్రజలందర్నీ చూచే భాగ్యం కల్పిస్తాం.

ముసలి: మంచిది బాబూ. మీరంత మంచిపని చేయదలచి నప్పుడు కాదని ఎవరంటారు? ఎవరడ్డొస్తారు ?

కవి : అడ్డొచ్చేవాళ్ళు లేకేం ?

ముసలి: ఎవరు బాబూ వాళ్ళు ?

కవి : గుడ్డిసంఘం. మొన్నటికి మొన్న నా స్నేహితుని భార్యను ఒకామెను దేవతాస్త్రీతో పోల్చి నేను

నాలుగు పద్యాలు వ్రాశాను. దాంతో గ్రుడ్డిసంఘం చెలరేగిరది, సాంబూదకు ఉద్వేక్తగా లేచింది.

శిష్యుడు: అంతటితో అయిందా? ఆమె భర్త మా కవి రాజులుంగారిని పట్టుకొని తన్నసుకూడా తన్నాడు.

ముసలి: అయ్యో పాపం, మీరైనా అటువంటిపని చెయ్యడం ఎందుకు బాబు? అందరికీ చూపును ప్రసాదిస్తానని చెప్పి మాత్సర్యాన్ని రేపి ఉన్నచూపును పోగొడు తున్నారే?

శిష్యుడు: కవిరాజుగారూ! వింటున్నారా ఈ ముసలిదాని మాటలు. నేను చెప్పినట్టు అచ్చంగా మన గుడ్డి సంఘం మాట్లాడినట్లే మాట్లాడుతున్నది. మన గుడ్డి సంఘానికొక ఆకారముంటే, ఇట్లాగే వుంటుందని నా నమ్మకం.

కవి : ఓ గ్రుడ్డీ! నాదారి తొలుగు. నేనే రకమైన అడ్డును సహించలేను. నేను కవిని. సర్వ స్వాతంత్రుణ్ణి, స్వేచ్ఛాప్రియుణ్ణి-తొలుగు.

ముసలి: అట్లాగే బాబు. (ప్రక్కకు జరుగుతుంది. కవి వెళ్ళి పల్లకీలో కూచుంటాడు.)

శిష్యుడు: పట్టండి పల్లకీ. జయీభవ దిగ్విజయీభవ!

ముసలి: అయ్యా, ఒక్కమాట!

కవి : ఏమిటి గ్రుడ్డీ మళ్ళీ అడ్డొస్తున్నావు?

ముసలి: లేదయ్యా. అడ్డురావాలనికాదు. మీ మంచినికోరి ఒకమాటను చెబుదా మనుకుంటున్నాను.

కవి : ఏమిటది ? కాలాతీతమవుతున్నది. త్వరగా చెప్పు.

ముసలి: నామాటవిని కొంచెం జాగ్రత్తగా వుండండి. ఇంతకుముందు మీరేదో వ్రాశామన్నారే పద్యాలు, అటువంటివి వ్రాయకండి. మంచి చేయాలనుకున్నప్పుడు మీరు పరిస్థితులను గమనించి చాలా సానుభూతితో చెప్పండి.

కవి : నీవు నాకే నీతులు ఉపదేశిస్తున్నావుగా !

ముసలి: ఒళ్ళు దగ్గిరుంచుకోవటం ఎవరికైనా మంచిదేగా బాబూ. మీరే చెబితిరిగా ఆయనెవరో...

కవి : ఓసి గుడ్డీ, నోరుముయ్. పోనివ్వండి పల్లకీ పోనివ్వండి.

శిష్యుడు: గండభేరుండ, నిత్యాగచనా దురంధర, కుకవి హృదయ విదారక, గుడ్డిసంఘ నిర్మూలనా బద్ధకంకణ ఇత్యాది బిరుదాంకిత శ్రీ శ్రీ శ్రీ కవిరాజు : (అని ఒకరంటూంటే)

మిగతావారు: జయీభవ ! దిగ్విజయీభవ ! (అంటూ పల్లకీ మోతతో వెడతారు.)

ముసలి: ఇదీ వరుస. కళ్ళుండీ చూళ్ళేరు. అటువంటివాళ్ళకు నేనేమిటి ? లోకమంతా గుడ్డిగానే కనిపిస్తుంది.

స్టేజీలోపలునుంచి ఏనుగు ఘీంకారం
వినిపిస్తుంది. ముసలి అటుతిరిగిచూసి...

ముసలి: అదిగో. ఏనుగుమీద సంఘసంస్కర్త వస్తున్నాడు. అతనికీ నేను గుడ్డిదాన్ననే భ్రమ. ఇది వాళ్ళవాళ్ళ లాభాలకోసం తెచ్చిపెట్టుకున్నభ్రమే అనుకుంటాను.

స్టేజీలోపల్నుంచి "దేశసేవాధురీణ, దేశభక్తాగ్రగణ్య, మానవసేవా ధురంధర ఇత్యాది బిరుదాంకితులైన సంఘ సంస్కర్తకీ జై జై" అనే నినాదాలతో ఏనుగు అంబారీ మీద సంస్కర్తను ఊరేగిస్తూ అతని అనుచరులు ప్రవేశిస్తారు.

ఒక ప్రేక్షకుడు: అతనెవరు? ఎక్కడో చూచినట్టుంది.

ఇంకొక ప్రేక్షకుడు: అవును. నిజమే ... ... ఆc ఆc జ్ఞాపక మొచ్చింది. ఈ హాల్లో ప్రక్కన కాఫీహోటలుండేదే, దానిలో సర్వరుగా వుండి, మేనేజరై, నాటక రంగ స్థలంలో కీర్తి గడించిన వీరశరభయ్య.

ఒక ప్రేక్షకుడు: ఓహో! అతనా? ఎప్పుడూ కాఫీలో పంచదార తక్కువ వేసేవాడు ... ... అదిగదిగో, ఏదో మాట్లాడబోతున్నాడు.

సంఘ సంస్కర్త: ఓ ముసలీ! నీకు ప్రాణాలమీద ఆశ వున్నట్టులేదే! ఎందుకు దారికడ్డొస్తావు? తొలుగు.

ముసలి: గుడ్డిదాన్ని బాబయ్యా! కాస్త మీరే తొలిగి పోకూడదూ?

సంస్కర్త: నా అంతటివాణ్ణి పట్టుకుని నన్నే తొలగిపొమ్మంటావుగా? నేను దారులు వేసేవాణ్ణేకాని, తొలగి పోయే వాణ్ణి కాను. ప్రజలందరినీ సక్రమమార్గాన నడిపించేవాణ్ణి.

ముసలి: కండ్లున్నవాళ్ళయితే అలాగే బాబయ్యా, మీరు చెప్పినట్టే నడుస్తారు. మరి నాకు చూపు లేదుగా. నా కేదారులు కనిపించవాయె. తొలగిపోదామని

ప్రయత్నించి మరీ మీ ముందుకు రాగలను. ఏండ్లొచ్చినదాన్ని. పైగా గుడ్డిదాన్ని. నన్ను కనికరించి కొంచెం తొలగిపొండి బాబయ్యా.

ఒక అనుచరుడు: నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలియక ఇలా అంటున్నావు. ఇన్నేళ్ళొచ్చినా, గొప్ప వాళ్ళను గౌరవించడం నీకు తెలియదు.

ముసలి: ఇందులో అగౌరవమేముంది బాబయ్యా. గుడ్డిదాన్ని. కొంచెం సహాయం చేయమంటున్నా.

సంస్కర్త: ఓ గుడ్డీ!! నీకు జవాబులు చెబుతూ కూచోవడానికి మాకుతీరిక లేదు. అవతల మానవులు సహాయం కోసం నిరీక్షిస్తూ ఉంటారు. తొలగిపో. మా ఏనుగు ఇక్కడొక్క క్షణం నిలువదు.

ముసలి: అదేమిటి బాబయ్యా, దారులు వేస్తామంటున్నారు? దారి చూపిస్తామంటున్నారు? కండ్లు లేనిదానికి ఇంత దారి చూపమంటే దయలేకుండా మాట్లాడుతున్నారే! కాస్త ఓర్పున్నా లేదే! ఇక ఇతరులకు మీరేం దారి చూపుతారు బాబయ్యా?

సంస్కర్త: 'ఓర్పు', 'దయ' అని కూర్చుంటే పను లెట్లా జరుగుతాయ్? మే చెబుతాం; చేయిస్తాం; మా మాట విననివాళ్ళమీదికి అనేక రకాల వత్తిళ్ళు తెచ్చయినాసరే మేం వినిపిస్తాం. చెప్పడం మాపని; చేయడం ప్రజలపని; లే అడ్డం!!

ముసలి: మీ మాటలకు నా మనస్సే చివుక్కుమంటూ వుంటే ఇంక ప్రజలకు మనస్సులో ఎంతకష్టపుతుందో!! కష్ట, పుట్టింతర్వాత ఇంక మంచీ చెడూ ఎవరాలోచిస్తారు బాబయ్యా.

అనుచరుడు: మంచీ, చెడూ ఎవరికాకావాలి? మేం సంఘ సేవ చేస్తున్నామని పదిమందీ మెచ్చుకుంటే మాకు చాలు.

ముసలి: మీ కీర్తికోసం ప్రజల్లో అల్లకల్లోలం పుట్టిస్తారా బాబయ్యా! ఇదేనా మానవులకు మీరుచేసే మంచి?

సంస్కర్త: గుడ్డీ, అధికప్రసంగం చేయకు. తొలుగుతావా; లేదా చెప్పు.

ముసలి: తొలగడానికి కళ్ళు కనపడవు బాబయ్యా ...... తొలగలేను.

సంస్కర్త: నువ్వు తొలక్కపోతే ఏమవుతుందో తెలుసా?

నీవు దారి తొలగకున్న
నిన్ను బలవంతముగ
రెక్కలను బట్టి
ఈడ్చి వైచెదము;
నీదు కుత్తుకనుబట్టి
కూల ద్రోసెదము;
ఎవరనుకుంటివో
ఓ గ్రుడ్డీ?
నేను సంఘ సంస్కర్తను!

ప్రజల పూలదండలతో
వంచుకొని పోవుచున్న
కంఠము గలవాడను!!
నీవు కదలకున్న
ఏన్గుచేత త్రొక్కించెదము!
పీన్గులను జేయించెదము!
ఏమనుకొను చుంటివో
ఏ గ్రుడ్డీ!!... ...

ముసలి: మీ చిత్తంవచ్చినట్లేకానీ బాబయ్యా. ఈ బ్రతుకు నాకూ భారంగానేవుంది. గొప్పవారు మీ చేతుల్లో చస్తే పుణ్యమయినా వస్తుంది. అట్లాగే తోలించండి ఏనుగును. (కదలకుండా నిలబడి వుంటుంది)

సంస్కర్త: ఏయ్, ఏనుగును పోనీ.

మావటి 'హేయ్. హేయ్' అని ఏనుగును అదిలిస్తాడు. ఏనుగు కదలదు.

ఒక అనుచరుడు: కదలదేం? తోలు గట్టిగా.

మావటి మళ్ళీ 'హేయ్ హేయ్' అంటాడు.

సంస్కర్త: ఏయ్ అదిలించు, తోలవోయ్.

మావటి మళ్ళీ గట్టిగా అదిలిస్తాడు.

మావటి: కదలడంలేదు బాబూ.

ముసలి: ఈ ముసలిదాన్నిచూస్తే ఏనుగుకున్నపాటి దయ కూడా మీకు లేకపోయె.

ఒక అనుచరుడు: సంఘ సంస్కర్తగారూ! ఈ ముసలిదాన్ని చూస్తే అప్పుడప్పుడూ కనిపిస్తూ బెదిరిస్తూ వుంటుంది చూడండి. (గుడ్డి సంఘం) అదిజ్ఞాపకం వస్తూంది.

సంస్కర్త: నేను సంఘానికి భయపడేవాణ్ణి కాను. నా భావాలు ఆచరణలో పెట్టడానికి ఎటువంటి త్యాగాలనైనా చేయడానికి సిద్ధంగా వున్నవాణ్ణి. సంఘాన్ని నాపాదాక్రాంతం చేసుకోవడానికి కృతనిశ్చయుడనై వున్న వాణ్ణి. పోనివ్‌-అంకుశం దింపు.

మావటి అంకుశంతో ఏనుగు కుంభస్థలంమీద పొడుస్తాడు. ఏనుగు పెద్దగా ఘీంకారం చేస్తుంది కాని కదలదు.

మావటి: దీని కేమొచ్చిందోగాని అయ్యా, ఎంత పొడిచినా నెత్తురు వరదలై కారుతున్నదేగాని కదలటం లేదు.

ముసలి: ఎందుకానోరు లేని జంతువు నట్లాహింసిస్తారు! ఇదిగో నేను తొలుగుతున్నాను. మీరు వెళ్ళండి. అయితే ఒక మాట మాత్రం జ్ఞాపకం వుంచుకోండి. మీరు తాత్కాలిక లాభాల కోసం అనేక దుష్టశక్తులను రేపుతున్నారు. ఆ దుష్టశక్తులు ఎప్పటికైనా మీమీదికి ఎదురుతిరక్క మానవు. అప్పుడు మిమ్మల నెవరూ రక్షించలేరు. కాస్త జాగ్రత్తగా మసులుకోండి.

సంస్కర్త: చెప్పొచ్చావ్‌లే, ఎట్లా అయితేం? నీపనేదో నువ్వు చూసుకో! పోనీవోయ్.

మావటి మళ్ళీ అదిలిస్తాడు. ఏనుగు కదులుతుంది. అనుచరులు మొదట ప్రవేశంఅప్పుడు చేసిన జయ నినాదాలతో నిష్క్రమిస్తారు.

ఒక ప్రేక్షకుడు: నోరు లేని, జంతువైనా, దానిబుద్ధి కూడా ఎటువంటిదో.

రెండవ ప్రేక్షకుడు: సృష్టిలో వస్తుతః అన్నీ మంచిబుద్ధి కలిగినవి అయిఉండాలి. కుటిల మానవుల స్పర్శ తగిలినచోటే దుర్మార్గం తలలేగుతూ వుంటుంది.

ఒక ప్రేక్షకుడు: దుర్మార్గం పెరిగినప్పుడే దాన్ని అణచడానికి భగవంతుడు అవతారం ఎత్తుతూ వుంటాడు.

స్టేజీలోపలనుంచి ఈశ్లోకం వినిపిస్తూవుంటుంది. శ్లోకానికి ముందు తిరుమూర్ణబాకాలు, తాసా మరపాలు ఇంకా అనేకమైన ధ్వనులు వినిపిస్తాయి.

'యదా యదాహి ధర్మస్య, గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య, తదా త్మానం
సృజామ్యహం'

శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మతీర్థ, పరబ్రహ్మానంద, మహాభక్తచూడామణి, అపరచింతామణి, సహస్రశిష్యకోటి పరివృత ఇత్యాది బిరుదాంకితులైన శ్రీ ప్రభంజనాభ్యుదయ స్వాములవారికి జై అనే నినాదాలతో స్వాములవారు గుఱ్ఱంమీద వేంచేస్తారు. మధ్యమధ్యన గుఱ్ఱం సకిలిస్తూఉంటుంది. స్వాములవారు మాట్లాడుతుంటారు.

స్వాములవారు: అదేకాకుండా భగవంతుడు మరొకమాట కూడా చెప్పాడు —

'పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే!'

అన్నాడు. శిష్టరక్షణార్థం, దుష్టశిక్షణార్థం ప్రతి

యుగములోను అవసరమైనప్పుడల్లా అవతరించెద నన్నాడు భగవానుడు.

శిష్యుడు: ఓహోహో! ఎంతబాగా చెప్పారు!! ఎంతబాగా చెప్పారు!!!

శిష్యురాలు: ఈ యుగంలో తమరే అవతారమూర్తులు. మా అదృష్ట వశాన మాకు దొరికారు.

స్వాములు: దొరికినమాట నిజమే కాని, భక్తులుకూడా తమ విధ్యుక్త ధర్మం నెరవేర్చినప్పుడు కదా— మోక్ష ప్రాప్తి!... సచ్చిదానంద.

శిష్యురాలు: ఆ ధర్మమేమిటో గురువులు సెలవిస్తే అట్లాగే ప్రవర్తించుకుంటాం.

స్వాములు: ఇంకా భగవాను లేమన్నారంటే: —

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వాం సర్వపా పేభ్యోమోక్షయిష్యామి మాశుచః'

సర్వధర్మములను పరిత్యజించి నన్నే శరణుపొందుము.

శిష్యవర్గం: ఓహోహో! ఎంత బాగా సెలవిచ్చారు! ఎంత బాగా సెలవిచ్చారు!

శిష్యురాలు: మేము మిమ్మల్ని అదేవిధంగా సేవిస్తున్నాం.

స్వాములు: అట్లు శరణుపొందినప్పుడు నేను నిన్ను సకల పాపములనుండి విడిపించెదను. నీవు శోకించకుము...

శిష్యురాలు: మా పాపాల నన్నింటినీ తమరే భరిస్తామని శెల విచ్చినప్పుడు ఇంక మాకు శోక మెందుకు స్వామీ? మాకింక చిన్మయానందమే.

స్వాములు: కదలండి... సచ్చిదానంద...

శిష్యురాలు: అవునవును స్వాములవారికి భోజనానికి వేళ అవుతూవుంది. నడవండి.

ఒక శిష్యుడు: ఓయ్ ముసలీ! తొలుగు. తొలుగు.

ముసలి: తొలిగేఉన్నాను బాబూ.

శిష్యుడు: ఆ తొలుగుడు చాలదు. ఇంకా అవతలకు వెళ్ళు.

ముసలి: ముసలిదాన్ని; గుడ్డిదాన్ని; కాలుతీసి కాలు వేయ లేని దాన్ని. ఇంకా ఎక్కడికి వెళ్ళమంటారు?

శిష్యుడు: ఓ గుడ్డీ! మేమేం మామూలుమనుష్యుల మనుకుం టున్నావేమిటి రాచుకుపోవడానికి? ఈ స్వాములవారు భగవంతుని అవతారం. వెళ్లు. వెనక్కువెళ్ళు.

ప్రేక్షకుడు: ముసలినింకా ఎక్కడికి పొమ్మంటాడురా? తెర లోకి పొమ్మంటాడా ఏమిటి?

రెం. ప్రేక్ష: అట్లాగే వుంది వాడి ధోరణిచూస్తే. ముసలి అంత వెనక్కు వెళ్ళినా ఇంకా వెళ్ళమంటాడు.

శిష్యుడు: ఇంకా దూరంగా తొలగిపో. ఇప్పుడు నీగాలి సోకిం దంటే స్వాములవారికి భోజనప్రాప్తి వుండదు.

ముసలి: అదేమిటయ్యా. ఎంతదూరం పోయినా ఇంకా పొమ్మంటారూ? స్వాములవార్ని భగవంతుని అవ తారమంటున్నారే; మనుషులందరూ ఆయన బిడ్డలే గదా. ఆయనకింత అంటూ సొంటూ వుంటుందా?

స్వాములు: సచ్చిదానంద... ఎక్కడికి వెళ్ళినా మూర్ఖులూ, భగవదాపచారులే ఎదురుపడుతున్నారు! సంఘ

మంతా పాపపంకిలమై పోయింది. సంఘం గుడ్డిదై పోయింది. చెప్పేవాళ్లూ వినేవాళ్లూ లేకుండా పోయారు.

శిష్యురాలు: స్వామీ! ముసుగులను మరిచిపోకండి. వినేవాళ్ళం మేమున్నాం.

స్వాములు: కాబట్టే ఇంకా ప్రపంచం నిలిచివుంది. లేకపోతే ఈపాటికే కల్క్యవతారం అశ్వారూఢుడై ఒకచేత ఖడ్గాన్నిబట్టి, ఈపాటికి సర్వసంహారం చేసివుండేవాడే!

శిష్యుడు: ఓ ముసలీ! ఇప్పటికైనా కాస్తసారం ఏడవవమ్మా, మేం చస్తున్నాం... ...

ముసలి: వెళ్ళండినాయనా. కాని ఒక్క సంగతిమాత్రం మరిచిపోకండి. ఎక్కడికి వెళ్ళినా ఈ దేశంలో నాబోటివాళ్లు మీకంటపడకుండా వుండరు. మాబోటివాళ్ళనుంచి మీరు తొలిగిపోవాలంటే మీరు మీ అవతారాలను ఉపసంహరించుకోవలసిందే.

స్వాములు: సచ్చిదానంద...... ఈ కల్మష భూయిష్టమైన ప్రపంచంలో పుట్టడమే తప్పు. పుట్టినా బ్రతకడం తప్పు.

శిష్యురాలు: స్వామీ! అంతపనీ చేశేరు! పాప పంకిలమైన ఈ ప్రపంచాన్ని ఉద్ధరించడానికి మీరు అవతారం ఎత్తినమాట మరిచిపోకండి.

శిష్యుడు: స్వాములవారు ఆకలిమీదవుండి అలా అన్నారు గాని వారి ఉద్దేశ్య మది కాదు.

సామీలు: సచ్చిదానంద. ఉపనిషత్తుల్లోంచి చెప్పినా. ఉపనిషత్ ధర్మాన్ని నిరూపించడానికే నాకీ అవతారముంగాని, లేకపోతే నాకేమిటి? ఈ లోకమేమిటి? ఊరంతా ఏమిటి? ఇదేవో మాయ. ఈమాయ ఇట్లా జరిగి పోతూ వుండవలసిందే. సచ్చిదానంద.

ముసలి: అయ్యా, తమరు అవతారమూర్తులు. తమరి మాటలు వింటూంటే ఈ దీనురాలికొక అనుమానం వచ్చింది.

స్వాములు: నీకూ అనుమానమా? సచ్చిదానంద.

శిష్యుడు: అడుగమ్మా. అడుగు. ఆతలితో చస్తున్నాం.

ముసలి: అవతార పురుషులుకూడా మానవుల్లో పుట్టినప్పుడు మానవమాత్రులుగా ప్రవర్తించాలని సెలవిస్తిరే; ప్రతిదివ్యపురుషుడు మానవమాత్రుడుగా ప్రవర్తించి లోకంలోవున్న ఆచారవ్యవహారాలన్నిటికీ అనుగుణంగా వర్తించడం మొదలుపెడితే దానివల్ల లోకానికేం లాభం స్వామీ? ఇక, ఈలోకం ఉద్ధరింపబడే దెప్పుడు? ఈ నెపంతో ప్రతివ్యక్తి తన స్వార్థంకోసం ప్రాకులాడ వచ్చుగా?

స్వాములు: సచ్చిదానంద. ఈ ప్రశ్నలను నువ్వడగకూడదు, మేము చెప్పనూ గూడదు. అది భగవదాజ్ఞ. మానవ సంఘం పతనమైపోయింది. గుడ్డిదై పోయింది. చెప్ప వలసినవ్వారు వింటున్నారు; వినవలసినవారు చెప్తు తున్నారు... సచ్చిదానంద.

శిష్యుడు: పోనివ్వండి.

మరో శిష్యుడు: స్వామీ! ఆ ముసల్ది మరీ దగ్గరకొచ్చి నిలబడింది.

స్వాములు: ఇది లౌకిక వ్యవహారం. దీన్ని మనం ఆట్టే పట్టించుకోకూడదు.

శిష్యుడు: కదలండయ్యా. ఆకలితో మాడుతున్నాం.

'శిష్యవర్గం తిరిగి శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మతీర్థ, పరబ్రహ్మానంద, మహాభక్త చూడామణి, అపరచింతామణి, సహస్ర శిష్య పరివృత ఇత్యాది బిరుదాంకితులైన శ్రీ ప్రభంజనాభ్యుదయ స్వాములవారికీ జై' అని అంటూ ఉంటారు.

ముసలి: (అడ్డొచ్చి) అయ్యా! ఒక్కమాట.

జయ జయ ధ్వానాలు ఆగుతాయి.

శిష్యుడు: తొలుగు తొలగిపో గుడ్డీ!!

ముసలి: ఒక్కమాట చెప్పిపోతాను.

స్వాములు: సచ్చిదానంద...

ముసలి: మీరేదో మానవసంఘం గుడ్డిదై పోయిందని అంటున్నారు. అంటే దానికేదో చూపును ప్రసాదించాలని మీకు ఉండిఉండాలి. ఆ పనికి పూనుకున్నప్పుడు సంఘంలో వున్న వారంతా దేవుని బిడ్డలనే సంగతి మాత్రం మరిచిపోకండి. దేవుడే అంటూ వుంటే మీలో నేకాదు, గుడ్డినై, కాటికి కాళ్ళుచాచుకొని వున్న నాబోటివాళ్ళల్లో కూడా వుండి వుంటాడు. అందుకని ముందు ఇతరులను ప్రేమించి, గౌరవించడం నేర్చుకోండి.

శిష్యుడు: ఓసి కళ్ళులేని కళ్లోడీ, మా గురుదేవులకు ఉప దేశం చేస్తున్నావా? తొలుగు. తొలుగు.

శిష్యురాలు: గురుదేవులు ముందే వూహించారు. వినేవాళ్లు చెబుతున్నారు, చెప్పేవాళ్లు వింటున్నారనీ చెప్పనే చెప్పారు.

శిష్యుడు: పో. పో. (నెట్టివేయబోతాడు)

ముసలి: అయ్యా, నా గాలి సోకగలదు. మీకీపూట భోజన ప్రాప్తి వుండదు. మరచిపోకండి.

స్వాములు: సచ్చిదానంద. (స్వాములవారు ఈ శ్లోకాన్ని పఠిస్తుంటారు)

"సర్వధర్మాన్. పరిత్యజ్య మామేకం శరణంవ్రజా
అహంత్వాం సర్వపాపే భ్యోమోక్షయిష్యామి మాచశుః"

శిష్యులు జై జై ధ్వానాలతో పల్లకితో నిష్క్రమిస్తారు.

ముసలి: అందరూ తమ బలహీనతలకు నన్ను అడ్డుపెట్టుకునే వారే! తమ స్వార్థాలను కప్పిపెట్టుకోడానికి నన్ను నిందించేవారే!! గుడ్డిదాన్నని పరిహాసం చేసేవాళ్ళే!! వాళ్ళకిప్పుడు గుడ్డిగాకనపడ్డనేను, ఎప్పుడో ఒకప్పుడు కండ్లు తెరిచినట్లు కనిపించకపోను. అప్పుడు వారే మవుతారు?... ...

తెర త్వరత్వరగా పడిన ధ్వని. ప్రేక్షకుల సందడి. ఈలలు. కరతాళధ్వనులు, పోడాలచప్పుడులు మళ్ళీ మొదలవుతాయి.

ఒక ప్రేక్షకుడు: ఇదంతా ఏదో కొత్తరకంగావుంది. ఏనుగులు, పల్లకీలుకూడా స్టేజీమీది కొస్తున్నాయి.

రెండవ ప్రేక్షకుడు: నువ్వు కరపత్రంలో చదవలా, ఇది నాటకరంగంలో విప్లవం తెచ్చిందనీ, ఈ నాటకంలో నూతనశకం ఆరంభమవుతుందనీ.

ఒక ప్రేక్షకుడు: చదవకేం కాని, కొత్తంటే ఈవిధంగా వుంటుందనుకో లేదు.

రెండవ ప్రేక్షకుడు: నాటక కర్త ఎవరోగాని కపట వేష ధారులమీద మంచి దెబ్బతీశాడు.

ఒక ప్రేక్షకుడు: ఎవరేముంది ? సుధాముల చంద్రయ్యగారని మా ఇంటిపక్కనే వుండేవారు... .. వాళ్ళనాన్న చదువుకొమ్మని బళ్ళోవేస్తే చిన్నప్పుడే చదువుమాని నాటకాల్లో చేరారు.

రెండవ ప్రేక్షకుడు: కాని, ముసలిదాన్ని అంతగా హింసించడం నాకంతగా నచ్చలేదు.

ఒక ప్రేక్షకుడు: ముసలిదడిగే ప్రశ్నలకు జవాబులు చెప్ప లేక ఎట్లా దూషించారో చూశావా ?

రెండవ ప్రేక్షకుడు: అదంతా బాగానేవుంది కాని, చివరకు ఆ ముసలిదానిక్కూడా ఒకసీసపద్యం పెట్టించి వాళ్ళరోగం కుదర్చాల్సింది.

ఒక ప్రేక్షకుడు: పెట్టవలసిందే. పేడితే బాగానేవుండేది. కాని, ఆ ముసలిది బిగించి పాడితే ఎవతిదాటిన వారు పరారయ్యేవాళ్ళం. నాటకం పూర్తయ్యేది. ఆ భయానికి లోనై నాటకకర్త ఆపని చేసివుండడు.

ఇంకో ప్రేక్షకుడు: ఆ ముసిల్ది ఎవరో మీకేమైనా తెలుసా?

నాల్గవ ప్రేక్షకుడు: తెలియకేం? నేను మానవ సంఘాన్నని చెప్పనే చెప్పిందిగా! మానవసంఘ మంటే మరి మనమే. అకవీ, సంఘ సంస్కర్తా, స్వాములవారూ దూషించిన దూషణలన్నీ మనలను దూషించినట్టే.

ఒక ప్రేక్షకుడు: ఆఁ, ఏమిటీ! మనం గుడ్డివాళ్ళమా?

రెండవ ప్రేక్షకుడు: అనే నాయకుల భావం.

మొదటి ప్రేక్షకుడు: అంత బాగరా!! ఈసారి ముసలిదాన్నొక్కమాటవనీ చూస్తా... చెక్కెయ్యకపోతే...

ఇంకో ప్రేక్షకుడు: మరి ఆ ముసల్ది మానవసంఘం, అయితే 'తొలుగు, ఇంకా తొలుగం'టాడేం, ఆ స్వాముల వారి శిష్యుడు? మానవసంఘం అంటరానిది కాదుగా?

రెండో ప్రేక్షకుడు: అంటరానిదనే వాళ్ళ దృష్టి.

మొదటి ప్రేక్షకుడు: ఆ ముసలిదాన్ని అడ్డం పెట్టుకొని మనను తిట్టారన్నమాట వీళ్ళు. సరే. మళ్ళీ తెర ఎత్తుతారుగా... చూద్దాం.

రెండో ప్రేక్షకుడు: ఇక, వాళ్లు ఈనాటకం ఆడినట్టే!!

ఇంకో ప్రేక్షకుడు: తర్వాత కథేమిటో?

నాల్గవ ప్రేక్షకుడు: తెరపై చూడుడు.

రెండో ప్రేక్షకుడు: ఇట్లాకాదు. ఈ నాటకాన్ని క్రొత్త పద్ధతిలో వ్రాయడంవల్ల మన కర్థమవుతుందో కాదో నని కరపత్రంలో కథంతా ప్రచురించారు. దాని

తర్వాత ఈ నాయకులంతా సంఘంలోకి వెళ్ళి ప్రజల నుద్ధరించడానికి ప్రచారం చేస్తారు.

ఇంకో ప్రేక్షకుడు: ఇంతకుముందు ముసలమ్మమీద చేసిన ప్రచారమేనా ?

రెండో ప్రేక్షకుడు: అన్నను అదే. ఆవిధంగా ప్రచారంచేసే టప్పటికి ప్రజల కాగ్రహంవచ్చి వాళ్ళను తలో తాపూ తాపుతారు. దాంతో వీళ్ళంతా కంగారెత్తి మళ్ళీ ఈ అరణ్యంలో కొస్తారు.

మొదటి ప్రేక్షకుడు: ఇదంతా స్టేజీమీద ఎలా చూపుతారో ?

రెండో ప్రేక్షకుడు: అదంతా చూపరు. దాన్ని మన వూహాకు వదిలేస్తే, కథను దెబ్బలుతిని అరణ్యంలో ప్రవేశించడం నుంచి ఎత్తుకుంటారు.

మొదటి ప్రేక్షకుడు: మన ఊహాకు ఒదిలెయ్యడ మేమిటి ? మనం ఊహించదలచుకుంటే ఇంటిదగ్గర ఉండి ఊహించుకోలేమూ ! ఇక్కడి దాకా రావడ మెందుకూ, డబ్బు ఎక్కువయ్యా ?

రెండో ప్రేక్షకుడు: ఈనాటకంతో ప్రారంభమయ్యే నూతన శకారంభంలో ఇదో భాగం.

మొదటి ప్రేక్షకుడు: సరే. బాగానేవుంది. డబ్బు తీసుకొని, మన నిక్కడికి రప్పించింది మనను నానా తిట్లు తిట్టి పంపడానికా ? తెర ఎత్తనీ చూద్దాం !

(పక్కనున్న పసిపిల్ల కెవ్వున కేక వేస్తుంది.

ఒక ప్రేక్షకుడు: ఊరుకోబెట్టవమ్మా. ఈ పక్క సంగీతం కూడా ఎందుకు ?

సోడాబుడ్డి కీచు ధ్వని.

మరో ప్రేక్షకుడు: రామ రామ ఆనాటక ంకంటే ఈ నాటకం పెద్దదైంది.

ఇంకో ప్రేక్షకుడు: తెర ఎత్తండయ్యా బాబూ. త్వరగా కానివ్వండి. ఈ మోతలన్నా కొద్దిగా తగ్గుతాయేమో.

మొ. ప్రేక్షకుడు. కానివ్వండి. ఆ చూపేదేదో త్వరగా చూపండి.

నాల్గవ ప్రేక్షకుడు: అదిగో తెర లేస్తూంది.

తెర గబ గబా పైకి చుట్టుకుపోయిన ధ్వని.

మూ. ప్రేక్షకుడు: మళ్ళీ అరణ్యమే.

రెండవ ప్రేక్షకుడు: చెబితినిగా. ఆనాయకులంతా దెబ్బలు తిని అరణ్యం ప్రవేశిస్తారని.

మొ. ప్రేక్షకుడు: అదుగో మళ్ళీ అదేవిధంగా పొగ అలుము కొంటూ వుంది.

ఇం. ప్రేక్షకుడు: అదేవిధ్ధంగా మళ్ళీ మధ్య చీలింద.

మొ. ప్రేక్షకుడు: అదిగో గుడ్డితల్లి వస్తూవుంది ...

స్టేజీ మీద ముసలమ్మ.

ముసలి: మాటిమాటికి నన్నడ్డంపెట్టుకొని నిందించటంవల్ల వచ్చే అపకారం ఇప్పటికి వీళ్ళకు కొంత తెలిసి వుంటుంది. వీళ్ళూ నాలో వాళ్ళే! అయితే

ఏం చెయ్యడం! అల్లరిపిల్లలను మంచి మార్గంలో పెట్టడానికి తల్లికూడా ఒక్కొక్కప్పుడు దండించాల్సి వస్తుంది. అదుగో-వస్తున్నారు.

స్టేజీ లోపల 'అయ్యో, బాబు' అనే ఆర్తనాదాలు; 'ఇంతటితో ఊరుకుంటామా? దీనికి తగిన శాస్తిచేయలేకపోతే మమ్మల్ని మారు పేరుపెట్టి పిలవండి!' అనే కేకలు వినిపిస్తాయి. కవి, అతని శిష్యులు రేగిన జుట్టుతో, చిరిగిన చొక్కాలతో పైవిధంగా కేకలు వేసుకుంటూ ప్రవేశిస్తారు.

ముసలి: ఏం నాయనా ఏం జరిగింది?

కవి : ఓ గుడ్డి! మళ్ళీ నువ్వొచ్చావా? నువ్వు మాపాలిటి దుశ్శకునానివి. వెళ్ళేటప్పుడు నీగుడ్డిముఖం చూశాం. అందుకే కనుభవిస్తున్నాం!

ముసలి: ఏం జరిగింది నాయనా?

కవి : ఈ గ్రుడ్డిసంఘం తనకోసం మేం పాటుపడుతున్నామని గ్రహించక మామీదకు చెలరేగింది.

శిష్యుడు: చెలరేగడ మేమిటి? ఇష్టమొచ్చినట్టు తన్నింది... అయ్యో, నాకాలు విరిగింది.

మరొక శిష్యుడు: నా సంగతేం చెబుతావు? నా నడుమే విరిగింది.

ఇంకో శిష్యుడు: చూడండి. నా మొహమంతా ఎట్లా రక్కిందో...

మొదటి ప్రేక్షకుడు: బాగాజరిగింది. మాపని కొద్దిగాతగ్గింది.

రెండో. ప్రేక్ష: ఊరుకో. ముసలమ్మ ఏదో అంటూంది విను.

ముసలి: నేను మీరు వెళ్ళేటప్పుడు చెప్పేగా నాయనా, కాస్త జాగ్రత్తగా మసలుకోమ్మని. మీరు నామాట విన్నారు కాదు. సింహం ఉపేక్షించి ఊరుకున్నదని జూలు పట్టుకొని లాగితే ఏమవుతుంది?

కవి: చెప్పొచ్చావులే ఎట్లాగైతేనేం. ఏదో తాత్కాలికంగా మాకు అపజయం లభించగానే అయిందా?

శిష్యుడు: మళ్ళీ వెడతాం. మళ్ళీ ఢీకొంటాం. మా వర్గాన్నంతా చేరదీసుకొని దండయాత్ర ప్రారంభిస్తాం. గుడ్డిసంఘానికి బుద్ధొచ్చి మా ముందు మోకరిల్లేటట్టు చేస్తాం.

ఒక ప్రేక్షకుడు: చేస్తే ఇంకా తింటారు తన్నులు. తినండి, తినండి. చచ్చేదాకా తినండి.

శిష్యుడు: అంతిమ విజయం మాదే. సంఘాన్ని ఏంచేస్తామో చూడు.

ముసలి: మీ ఇష్టమొచ్చినట్లు చేయండి నాయనా. కాని ఒక సంగతిమాత్రం మరిచిపోవద్దు. ఈలోగా సంఘం కూడా తనని తాను రక్షించుకోవడానికి సిద్ధంగా వుంటుంది.

శిష్యుడు: ఉండనీ.

మళ్ళీ స్టేజీనుంచి ఆర్తనాదాలు, కేకలు వినిపిస్తాయి. ఏనుగు ఘీంకారాలు పెట్టుకుంటూ రంగంమీదనుంచి వెడుతుంది. దానివెంట సంఘసంస్కర్త, అతని అనుచరులు ప్రవేశిస్తారు.

సంఘ సంస్కర్త: ఏమోననుకున్నా! గుడ్డిదే ఈ సంఘం మననేం చేస్తుందనుకున్నా? ఒక వుపన్యాసం చెప్పి లోబర్చుకోలేక పోతానా అనుకున్నా. ఎంతపని చేసింది!!!

అనుచరుడు: విరుచుకు మీదపడింది. లబో దిబో అంటే మన మాటైనా వినిపించుకుందా?

సంస్కర్త: దాని దౌర్భాగ్యానికి దాన్ని విడిచిపెట్టడమే బాగనిపిస్తోంది. ఏదో గుడ్డిదిగదా, దారీ తెన్నూ తెలియక అల్లాడుతోందిగదా, కాస్త కనువిప్పు కలిగిస్తే, బ్రతికిపోతుందని ఆశపడ్డా.

ముసలి: మానవ సంఘంకోసం కాదుగా నాయనా, మీరు తాపత్రయ పడింది. ప్రజల మెప్పుకోసమని చెబి తిరిగా వెళ్ళేటప్పుడు.

అనుచరుడు: నువ్వడిగితే అన్నాం, నీదగ్గిర ఏమాటఅన్నా మేమసలు ప్రయత్నించేది మానవసంఘ శ్రేయస్సు కోసమే.

ముసలి: నిజంగా మీరు సంఘశ్రేయస్సుకోసం పాటుపడితే మీకది గుడ్డిదిగానే కనిపించేదికాదు. దాని చూపు దానికున్నదనీ, దానిదారి దానికున్నదనీ తెలిసేది.

అనుచరుడు: దానిదారి దానికుంటే ఇక మేంచేసేదేమిటి గుడ్డీ.

ముసలి: దారి నిష్కంటకం చేయొచ్చునాయనా. దారిలో వున్న ప్రమాదాలను నిర్మూలించి, దాని గమనాన్ని వేగం చేయొచ్చు.

మొదటి ప్రేక్షకుడు: సెబాష్-బాగా చెప్పింది

మూడవ ప్రేక్షకుడు: ఆమె చెప్పిందంటే మనం చెప్పినట్టే, తక్కినరోగం కుదిర్చింది.

స్టేజీలో మళ్ళీ గోల వినిపిస్తుంది, సర్వ ధర్మాన్......అనే శ్లోకం వల్లించుకుంటూ స్వాములవారు హడావిడిగా ప్రవేశిస్తారు. అతనివెంట 'అయ్యో,అబ్బా'అని శిష్యులు మూలుగుతూ భయం భయంగా వెనక్కు చూసుకుంటూ ప్రవేశిస్తారు.

శిష్యురాలు: స్వాములవారినికూడా విడిచిపెట్టలేదు.

శిష్యుడు: అది గుడ్డిది. దానికి స్వాములవారనీ, స్వాములవారి శిష్యులనీ కనిపిస్తుందా? దానికందరూ ఒకటే.

స్వాములు: సచ్చిదానంద, లోకం ఎంత పతనమైపోయింది. చెప్పవలసినవారు వింటున్నారు; వినవలసినవారు చెబుతున్నారు. ఓ! గుడ్డీ, నువ్వింకా ఇక్కడే వున్నావా? తొలుగు. తొలుగు.

ముసలి: నాయనా, నీకింకా చిత్తశుద్ధి కలగకపోయె. మీరు 'మానవులు, మానవులు' అంటున్నారే; నేనుమాత్రం ఆజాతికి చెందనిదాన్నా? నాకు చూపు లేదనుకుంటే, నామీద మీరింకా సానుభూతిని చూపి నా కష్టాలను పారదోలడానికి ప్రయత్నించాలిగాని ఇట్లా అసహ్యించుకుని తోసేస్తే భగవంతుడు హర్షిస్తాడా నాయనా? గుడ్డిది, గుడ్డిది అని నన్ను మాటిమాటికి బాధపెట్టడంలో మీకుగలిగే ఆనందమేమిటో నాకు తెలియడంలేదు, ఇంత చిన్నవిషయం మీకెందుకు

అర్థం కావడం లేదో నాకు బోధపడకుండా వుంది. నా గుడ్డితనాన్ని కూడా మీరు మీ స్వప్రయోజనాలకు ఉపయోగించుకోవడం ఎంత దారుణం? నామీద సానుభూతిని చూపండి మీరంతా. నేనెంత ముసలిదాన్నయినా, గుడ్డిదాన్నయినా మీకంటే అనుభవం వున్నదాన్ని. తరతరాల్నించి వస్తూవున్న ఆచార వ్యవహారాలను, సాంప్రదాయాలను జీర్ణించుకున్నదాన్ని. నావల్ల కూడా మీకు కొంతలాభముంటుంది. నా అనుభవంలో మీకు సరైన మార్గాన్ని చూపగలను. కావలసింది నా పట్ల మీకు కొంచెం సానుభూతి.

కవి శిష్యుడు: కవి రాజులుంగారూ, వింటున్నారా? నేను మొదట్లో చెప్పలా, ఈ గుడ్డిది అచ్చంగా గుడ్డి సంఘం మాట్లాడుకున్నట్టు మాట్లాడుతున్నదని. గుడ్డి సంఘమే ఈ మూరు రూపంలో వచ్చింది కవిగారూ.

కవి : నిజమే చూపులేకపోయినా, దానికళ్ళు ఇలాగే జ్యోతుల్లా ప్రకాశిస్తూ వుంటాయి.

సంస్కర్త: నిజమే. ఇది మానవస్వరూపంలో వున్న గుడ్డి సంఘమే. వయస్సు మళ్ళినా దీని శరీరం అంత పటుత్వంగానూ ఉన్నది.

స్వాములవారు: సచ్చిదానంద. ఇది మానవసంఘ రూపమే. మానవ సంఘమునందు అగుపడినట్లే ఈమెయందును వొట్టి శరీరమే కాని ఆత్మ కాన్పించదు. మానవ

సంఘమునకు వలెనే ఈమెయు మురికి బట్టలను ధరించినది.

శిష్యురాలు: చూస్తారేం. మన స్వాములవారిని హింసించిన మానవ సంఘం అట్లా ఎదురుగా నిలబడివుంటే అట్లా చూస్తారేం ?

కవి శిష్యుడు: ఓసి గుడ్డీ. నువ్వా, మమ్మల్నింతపని చేసింది!

సంస్కర్త శిష్యుడు: నేను నిన్ను మొదటిసారి చూచినప్పుడే అనుకున్నా. ఈ రూపంలో మమ్మల్ని పంపించి, అక్కడ మారురూపంలో మమ్మల్ని హింసించావని. ఇప్పుడెక్కడికి పోతావ్.

శిష్యవర్గమంతా 'తన్నండి, తన్నండి, పొడవండి, కసితీరాలి. ఈ దెబ్బతో మానవ సంఘం రూపు మాయాలి' అని కేకలేసుకుంటూ మీది మీది కెడతారు.

మొ. ప్రేక్ష: అరెరే! ముసలిదానిమీది కెడుతున్నారు.

మూడవ ప్రేక్ష: ముసలిదంటే ఎవరు ? మానవసంఘమంటే మనమే. మనమీదికే వస్తున్నారు. ఇందాకటినుంచీ అంటున్న మాటలన్నీ మననే.

మొదటి ప్రేక్ష: లేవండి. ఈ అవమానాన్ని మనం సహించకూడదు.

ప్రేక్షకుల్లో ఒక్కొక్కరు– 'చూడు మిమ్మల్నేంచేస్తామో, మంచీ, చెడ్డా లేకుండా మాట్లాడుతున్నారు. ఇందాకటి నుంచే మీరన్నవన్నీ సహించాం. ఇంకొక్కక్షణం కూడా వూరుకోం. మమ్మల్ని దూషించి, అవమానించి, బ్రతికి

పోయినవాడు ఒక్క...మాతేడు' అనే కేకలు వేసుకుంటూ కొందరు బల్లలు, కుర్చీలు విసర్గొడ్తుంటారు. గందరగోళం ప్రారంభమౌతూంది.

కవి : అయ్యయ్యో! ఇదేం అన్యాయం. నా ఇరవయ్యేళ్ళ కవితానుభవంలో, ఇటువంటి ఘోరం ఎక్కడా చూడలేదు.

సంస్కర్త: వాళ్ళకు దొరికితే మనల్ని బ్రతకనివ్వరు.

స్వాములు: సచ్చిదానంద ... ... ...

కవి : ఇంకా సచ్చిదానంద ఏమిటయ్యా? ప్రాణాలమీదికొస్తేను. పారిపోదాం పదండి.

సంస్కర్త: ఎక్కడికి పారిపోతాం? చుట్టుముట్టేశారు.

స్వాములు: సచ్చిదానంద. ఈ గుడ్డిముసిల్ది మనలని ఈ అపాయంనుంచి తొలగించడానికి అవతరించిన జగన్మాత. ఆమె శరణుపొందండి.

సంస్కర్త: ఏదీ! ఎదీ! గుడ్డిముసల్ది ఏదీ?

కవి : ఇంకెక్కడా! ప్రేక్షకుల నావహించింది. కనపడటంలా వాళ్ళచూపులు. గుడ్డిసంఘం కన్ను తెరిచింది. ఆ చూపుల్లో మనం భస్మమవడమో, లేకపోతే మన తప్పులను క్షమించమని సంఘానికి నమోవాకాలర్పించి తప్పించుకోవడమో చేయగలిగింది.

ప్రేక్షకులు దగ్గిరకొచ్చినట్టు ధ్వని ఎక్కువవుతుంది.

సంస్కర్త: కవీ, త్వరగా ఏదన్నా పాటఎత్తుకో! ... ... వీరి కోపాన్ని ఉపశమింపజెయ్యి.

కవి : నా గొంతు ... ఎండిపోతూ వుంది ... పెగలటం లేదు.

స్వాములు: సచ్చిదానంద ..!. మించిపోతూ వుంది కవీ ...

కవి పద్యం ఎత్తుకోటానికి ప్రయత్నం చేస్తాడు. కాని గొంతు పెగలదు. ఇంతలో ప్రేక్షకులు కేకలు వేసుకుంటూ వారిని చుట్టబెడతారు. కొంతమంది ప్రేక్షకులు కుర్చీలూ, బెంచీలూ విరగగొడుతుంటారు. స్వాములవారూ, సంఘ సంస్కర్తా, కవీ సైడ్ కర్టెన్స్‌లోనుంచి పారిపోతుంటారు ...... 'పట్టుకోండి......ఎక్కడికి పోతారు? పట్టుకోండి' అంటూ ప్రేక్షకులు వెంటపడతారు......రకరకాల గోలతో హాలు దద్దరిల్లిపోతూవుంటుంది.

ఇక పారిపోతున్న కవినీ, సంఘ సంస్కర్తనీ, స్వాములవారిని పట్టుకోగలగారా లేదా అనే సంగతి, ఒకవేళ పట్టుకొనిఉంటే ఏమిచేశారనే సంగతి, అనవసరమైన సంగతులు. అందుకని నేనా విషయం ప్రస్తావించకుండా వొదిలివేశాను.

(౧౪)

# మిగిలిన కథ

## పాత్రలు :

| | |
|---|---|
| కవి | కథానాయిక హేమాంగిని |
| కవి భార్య | ప్రొడ్యూసర్ |
| ప్రొడక్షన్ మేనేజర్ | ప్రొడ్యూసర్ మిత్రులు |
| డైరెక్టరు | ... ... ... ... |

---

కవిఇల్లు. కవిభార్యా, కవీ మాట్లాడుకుంటూ వుంటారు.

కవి భార్య: ఆ ధనాధన్ ఫిల్మువాళ్ళు—

కవి : ధనాధన్ ఏమిటి? అధునాతన.

క.భా: అదేదో నాకు సరిగ్గా రాదు. ఆఫిల్ము డైరెక్టరు మీకోసం ఎన్నోసార్లు కబురు చేశారండీ! 'ఇవ్వాళొస్తారు, రేపొస్తారు' అని చెప్పడానికి నాకు సిగ్గేసింది. ఏమో పాపం! మొన్న మనకివ్వవలసిన డబ్బు కూడా పంపించివేశారు.

కవి : ఆయన కష్టసుఖాలు తెలిసిన మనిషి. డబ్బు విషయంలో ఎప్పుడూ పేచీలేదు. ఎగ్రిమెంటు అవటంతోటే సగం డబ్బు ఇచ్చేశారు. ఈనాల్గు నెలల నుంచీ ఆర్థిక బాధలు లేకుండా వున్నామంటే, ఆయన మంచివల్లేగా.

క.భా: మీరంటే చాలా, అభిమానమున్నట్టుకూడా వుంది. ఎప్పుడూ మిమ్మల్నే కలవరిస్తూ వుంటారు.

కవి : అవును. మరి నా శక్తి సామర్థ్యాలను గమనించినవాడు.

బయట కారు ఆగిన శబ్దం వినిపిస్తుంది.

క.భా: మీకోసం ఎవరో వచ్చినట్టున్నారు.

గొంతు: (బయటనుంచి) కవిగారూ ! కవిగారూ !

క.భా: ఆయ నేనండీ. రోజూ మీకోసంవచ్చేది.

కవి : ఆయనా ! ఆధునాధన ఫిలింస్ ప్రొడక్షన్ మేనేజరు గారు.

ప్రొ.మే: (ప్రవేశించి) కవిగారూ !

కవి : అయ్యా ! దయచేయండి. దయచేయండి.

ప్రొ.మే: అబ్బ !! యిప్పటికి మిమ్మల్ని పట్టుకోగలిగాం అన్నమాట. తిరిగి తిరిగి ప్రాణాలమీదకు వొచ్చింది,

కవి : క్షమించాలి. ఈమధ్య నేను వూళ్ళో లేను.

ప్రొ.మే: అవునట. మీ ఆవిడ చెప్పారు. మీకొక సంతోష కరమైన వార్త చెప్పటానికి వచ్చాను. మన పిక్చరు పూర్తయింది.

కవి : ఆ ! నిజమా !

ప్రొ. మే: ఇవ్వాళ పూర్తి పిక్చర్ వేస్తున్నాం. అందుకనే మిమ్మల్ని డైరెక్టరుగారు వున్నవాణ్ణి వున్నట్టుగా తీసుకురమ్మని పంపారు.

కవి : ఇదుగో క్షణంలో వచ్చేస్తాను. సీతా! సీతా! ఆ లాల్చీ ... సిల్కుది ...పైపంచెకూడ యివ్వు ... జరీ అంచుది.

కవి. భా: పెట్టెలో వున్నాయి, గదిలో.

కవి : పద, పద, త్వరగా యివ్వు...క్షణంలో వచ్చేస్తాను.

ప్రొ. మే: త్వరగా కానీయండి, డైరెక్టరుగారు మీకోసం ఎదురుచూస్తూ వుంటారు.

*     *     *

కవీ, కవిభార్యా లోపలగదిలో

కవి : సీతా! ఇక మన కష్టాలు గట్టెక్కినాయి. నా కథ చిత్రంగా బయటికివస్తే ఆంధ్రులు తప్పకుండా ఆదరిస్తారు. ప్రజలందరికీ నా శక్తి సామర్థ్యాలు తెలుస్తాయి. కీర్తికి కీర్తి, ధనానికి ధనం.

కవి. భా: స్వంశోషమే సగంబలం... మీరు త్వరగా వెళ్ళండి. ఆలస్యమైతే డైరెక్టరుగారు ఏమన్నా అనుకుంటారేమో!! (కవిభార్య బట్టలుతీసి ఇస్తుంది, కవి త్వర త్వరగా వేసుకుంటాడు.)

*     *     *

అధునాధన ఫిలింసు వారి ఆఫీసు. డైరెక్టరుగది. పుస్తకాలు, ఫిలిం టిన్సు దొంతర్లుగా పేర్చి ఉంటాయి. చుట్టూ గోడలకు, ఆ కంపెనీ వారు తీసిన చిత్రాల్లోని ప్రముఖపాత్రధారుల ఫోటోలు వేలాడుతూ వుంటాయి. డైరెక్టరు రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చుని ఉంటాడు. తలకు సూటిగా పైన ఫాన్ తిరుగుతూ వుంటుంది. ప్రక్కనవున్న

కుర్చీలో కథానాయిక 'హేమంగి' ఎదురుగావున్న కుర్చీలో ప్రొడ్యూసర్, భీమరావ్ కూర్చుని వుంటారు.

డైరె: ఈ పిక్చర్లో తారామండలంలో దేదీప్యమానంగా వెలిగిపోతావు హేమా! నీ అందాన్ని నేను ఎక్స్ ప్లాయిట్ చేసినంత మరే డైరెక్టరూ చేయలేదు. నేను తీసిన యాంగిల్సు నే తీసిన షాట్సు మరెవ్వరికీ చాతకావు. ఈ క్లోజప్ తీశానుచూడు. డిస్ట్రిబ్యూటర్లు గుమ్మైపోవాలి. మాట్లాడవేం హేమా! నీవొకటి గమనించావోలేదో! నేను అందరి డైరెక్టరులకుమల్లే కాదు, ప్రతి పిక్చరులోనూ ఏదో ఒక నూతనత్వం చూపిస్తూనే వున్నాను.

ప్రొడ్యూ: చిత్తం, పేపర్లవాళ్లు......

డైరె: ఛా! పేపర్లవాళ్ళ మాట నా దగ్గిర ఎత్తకు. వాళ్ళకి సినిమా అంటే ఏమిటో తెలియదు. చేతికి వచ్చినట్టు వ్రాస్తారు. ఈసారి మన పిక్చర్లో వాళ్ళని చెక్కే-శాను చూశావుగా. లవ్ సీన్లో హేమాంగిచే యిప్పించిన వుపన్యాసం విని వాళ్ళింకా తలెత్తుకుని తిరగ్గలరూ?

ప్రొడ్యూ: అబ్బే! పేపర్లు కట్టేసుకుని, చంకన పెట్టుకుని యీ వూరు వదిలేసి వెళ్ళాల్సిందే!

డైరె: దట్ యీస్ యిట్... మరి మన చిత్రం యివ్వాళే చూద్దామనుకున్నామా! కవిగారేరీ, యింకా రాలే

దేం ? లేచావేం ? హేమా ! ప్రొజెక్షన్ చూడ్డానికి వస్తావుగా. సరే, గుడ్ బై !

హేమాంగిని వెళ్తుంది. కవీ, ప్రొడక్షన్ మేనేజరు ప్రవేశిస్తారు.

ప్రొమ్యా: కవిగారు వచ్చారు.

డైరె : వచ్చావూ ! యిన్నాళ్ళకి.

కవి : ఏదో...

డైరె : పోన్లెండి ! బయలుదేరుదామా ?... టైమయింది.

కవి : అలాగే.

(కార్లో కవీ, డైరక్టరూ వెళ్తూఉంటారు.)

డైరె : కవిగారూ! మీ కథలో కొద్దిగా మార్పులు చేశాను. అబ్బే! పెద్దమార్పులు ఏవీ లేవు. పిక్టోరియల్ బ్యూటీ కని చిన్న చిన్న మార్పులు చేశాను. (కవి ఉలిక్కి-పడతాడు ) మీరు కథానాయికని బీదపిల్లని చేశారు చూడ్డండి, నేను ఒక ధనవంతుని బిడ్డను చేశాను.

కవి : అయ్యయ్యో ! ! ఐతే కథ అంతా చచ్చినట్లే.

డైరె : అబ్బే, చాలా చిన్నమార్పు-హేమాంగివంటి స్టార్ని చింపిరి బట్టలువేసి, ఒక గుడిశలో పెడితే ఏంబాగుం టుంది చెప్పండి. అందుకని ఓ పెద్ద సెట్టువేసి ధన వంతుడి కూతుర్ని చేశాను, మీ "పడచు పిల్ల" పిక్చర్లో.

కవి : అయ్యో ! నాకథ పేరు 'పడుచుపిల్ల' కాదండి 'విశ్వప్రేమ'

డైరె : రెంటికి ఏమంత భేదంవచ్చిందిలే. అంతేకాకుండా విశ్వప్రేమ అంటే మార్కెట్ కి ఏం అర్థమవుతుంది? 'పడుచుపిల్ల' అనగానే, అందులో ఏదోవుందని జనం తండోపతండాలుగా వస్తారు. అందుకని 'విశ్వప్రేమ'ను 'పడుచుపిల్ల'గా మార్చాను. మీకథలో రాజారావు భార్యవున్నది చూడండీ—

కవి : రాజారావుకి భార్య లేదు కదండీ. ఉన్నది చెల్లెలు.

డైరె : అవును. నిజమే. చెప్పటం మరిచాను. ఆచెల్లెల్ని భార్యగా మార్చాను. అలా చెయ్యకపోతే కథలో గ్రిప్ లేకుండా పోతుంది. కారెక్టర్స్ కి కాంట్రాస్టు ఉండదు. ఏమంటారు?

కవి : చిత్తం. ఇంకా నేను అనేదేముందండీ! ఇంకా ఏమేమి మార్పులు చేశారో సెలవిస్తారా?

డైరె : ఆ...... పెద్ద మార్పులుఏవీ లేవు. ఏవో సినిమాకు అవసరమైన మార్పులు అక్కడక్కడ చేశాను. చూద్దురుగానిగా. మీ కథనుచూసి మీరే ఆశ్చర్య పోతారంటే నమ్మండి.

కవి : చిత్తం—ఆపని ఇప్పుడే మొదలయిందండీ!

కారు గమ్యస్థానం చేరుకుంటుంది.

* * *

ప్రొజెక్షనుగది. డైరెక్టరూ, కవి ప్రవేశిస్తారు. ప్రొడ్యూసరూ, అతని మిత్రులు అంతకుముందే కూర్చుని వుంటారు.

డైరె : అంతా సిద్ధంగావుంటా ? అందరూ వచ్చారా ?

ప్రొ : చిత్తం.

డైరె : హీరోయన్ ?

ప్రొ : బాక్సులో కూర్చున్నదండీ.

డైరె : సరే. దయచేయండి. ఈఫాన్‌కింద కూర్చుందాం. మరోకమాట మర్చిపోయాను కవిగారూ. మరొక చిన్న మాస్పుకూడా మీతో చెప్పాలి. మన కథానాయకుడికి బాక్సింగ్ సీను ఒకటి పెట్టాను.

కవి : అయ్యయ్యో! అదేమిటండీ ? మన కథానాయకుడు చదువుకున్న వాడు. సంస్కారం వున్నవాడూ, పెద్ద సైంటిస్టు అతనికి బాక్సింగేమిటండీ ?

డైరె : అట్లా అంటే ఎలాగండి ! బాక్సింగ్ సీను చూట్టానికి ఎంతమంది జనం వస్తారనుకుంటారూ ! వాళ్ళ రుచులకు కాటర్ చేయకపోతే ఏంలాభం ?

కవి : మన కథానాయకుడు ఎన్నడూ వ్యాయామం కూడా చేసినవాడు కాడే.

డైరె : ఆ ఏర్పాటు నేను చేశాను. అదే స్ట్రోక్ ఆఫ్ జీనియస్. కథానాయకుడు హార్సు రేసెస్‌లో తనకున్న డబ్బంతా పోగొట్టుకుంటాడు. అందుకోసం హార్సు రేసెస్ కూడా ఏర్పాటు చేశాలెండి. చేతిలో పైసా వుండదు కథానాయకుడికి. తల్లిదండ్రులను పోషించాలి. ఏం చేస్తాడూ ? బాక్సింగ్ నేర్చుకుని సంపాదనలోకి దిగుతాడు. తల్లి తండ్రులకోసం యిలా కష్ట

పడటం ఎటువంటి సెంటిమెంటో చూడండి. ప్రేక్షకుల హృదయాలు కరిగి నీరవ్వాలి. అక్కడ హీరో వరల్డ్ ఛాంపియన్‌తో పోట్లాడుతూ వుంటాడు. ఇక్కడ తల్లి తండ్రులు 'హరేరామా, హరేరామా' అని పూజచేస్తూ వుంటారు. అక్కడ పోట్లాట, యిక్కడ పూజ, —ఇంటర్ కట్స్ - టెంపో రైజెస్- చివరికి తల్లితండ్రుల పూజా ప్రభావంవల్ల పందెం గెలుస్తాడు. షాశారా మజా. ప్రేక్షకులు కరతాళ ధ్వనులు చేయవలసిందే!!

కవి : చిత్తం. కాని...

డైరె : అబ్బే యిప్పుడేం మాట్లాడవద్దు. పిక్చరు చూసిన తర్వాత చెబుదురుగాని, మీ కథని చూపడంలో ఎటువంటి అద్భుతమైన టెక్నిక్‌ను యడాప్ట్ చేశానో మీకే తెలుస్తుంది. మీ కళ్ళు మీరే నమ్మరు.

ప్రొడక్షన్ మేనేజరు వచ్చి డైరెక్టరుకూ, కవికీ డ్రింక్స్ యిస్తాడు.

డైరె : ఏమిటి ఆలస్యం? యు కెన్ స్టార్ట్.

ప్రొ. మే: అయిపోయిందండీ రీల్సు జాయిన్ చేస్తున్నారు.

డైరె : ఇంతకాలం అసిస్టెంట్సు ఏం చేస్తున్నారు? ఎంత స్టాఫ్‌వుండి ఏం లాభం? అన్నీ నేనే ఏడ్చుకోవలసి వచ్చె.

తెరపై గంట మోగుతుంది.

ప్రొ. మే: అదిగోనండీ మొదలుపెడుతున్నారు.

సినిమా వాద్యసంగీతం: సినిమా ప్రొజక్షన్ ప్రారంభిస్తారు.

డైరె : చూశారండీ కవిగారూ. టైటిల్స్ అన్నీ కొండల మీద రాయించాను.

కవి : బాగానేవుంది కానీండి, భావం నాకర్థం కావటం లేదు. మన కథ అచ్చంగా మైదానంలో జరిగే కథ. అటువంటప్పుడు ఈ కొండలతో మొదలుపెట్టడంలో అర్థం ?

డైరె : ప్రతిదానికీ అర్థంకోసం వెతికితే ఎల్లా కవీ! పిక్టోరియల్ బ్యూటీకోసం, కొన్నిదృశ్యాలు, సన్నివేశాలు కల్పించుకోవడంలోనే వున్నది డైరెక్టర్ ప్రతిభ. టైటిల్స్‌కి బాక్‌గ్రౌండుగా కొండలు పెట్టాలనే ఉద్దేశంతో కథలో చిన్న మార్పు చేశాను. కథానాయకుడు కష్టాలు భరించలేక ఆత్మహత్య చేసుకోవాలని, ఒక కొండ ఎక్కి క్రిందికి దూక ప్రయత్నిస్తాడు. ఆ షాట్ ఓ యాంగిల్‌లోనుంచి తీసుకొనేటప్పటికి అద్భుతంగా వచ్చింది.

కవి : అదేమిటండీ! మన కథానాయకుడు చీటికి మాటికి ఆత్మహత్య చేసుకోవటానికి ప్రయత్నించడు.

డైరె: అల్లా అని ఊరుకుంటే ఎల్లా చెప్పండి. స్వభావంలో వెరైటీ లేకపోతే కారెక్టర్ డల్ అవుతుంది. ఒకప్పుడు ఒక రకంగా, మరొకప్పుడు మరోరకంగా వున్నప్పుడే మజా. (కవి నిట్టూరుస్తాడు)

డైరె : అదిగో మీ పేరు, చూశారా! ఎంత పెద్ద అక్షరాలలో వేయించాను. మీరు కవులు. కోయిల

లంటే మీకు ఇష్టం. అందుకని మీ పేరు కోయిల నోట్లోంచి వస్తున్న గానవాహినిగా వేయించాను. ఈ పిక్చర్లో అంతా కొత్త టెక్నిక్ ఏర్పాటు చేశా లెండి.

తెరపై రైలు.

కవి : ఎక్కడికండీ ఆ రైలు వెళుతూవుంది?

డైరె : చికాకోల్-కథానాయిక వూరు.

కవి : ఎందుకో?

డైరె : ఊరికేనే. అక్కడ కథ కొంచెం డల్ అయితే, టెంపోకోసం ఏర్పాటు చేశాను.

కవి : హతోస్మి! హతోస్మి!

తెరపై మోహనాంగిపాట. పాట తేలికపారు ప్రేమ పాటగా వుంటుంది, హా ప్రియాతో ప్రారంభమై.

కవి : పెద్దయింటి పిల్లే- అటువంటి పేలవమైన పాట పాడించారేం?

డైరె : మీకు మాస్ సైకాలజీ తెలియకపోతే వూరుకోండి. ఆమాత్రం మజాఅన్నా లేకపోతే డబ్బెట్లావొస్తుంది?

కవి : నేను చాలారోజులనుంచి కథలు రాస్తున్నానండీ! ఆంధ్రలోకం బాగానే హర్షిస్తూవుంది. ఆంధ్రుల రుచులు నాకు తెలియనివికావు.

డైరె : కథ టెక్నిక్ వేరు; సినిమా టెక్నిక్ వేరు. కవీ, మీరది తెలుసుకోవాలి. అదిగదిగో, అదిమాడు... ఎటువంటి సంభాషణ కథానాయికనోట ఉంచానో.

కొరకపై కన్నానాయిక మాట్లాడుచూన్నుంది.

"సోదర సోదరీమణులారా! హిందు, బౌద్ధ, సిక్కు, జైన, పారశీక, ముసల్మాన్, క్రైస్తవులారా! ఒకానొకప్పుడు అమృత వాహినులు ప్రవహించిన మన భారత ఖండంలో, మందార, మకరంద మాధుర్యమున తేలియాడిన యీ పుణ్యభూమిలో, నేడు క్షుధాపీడితులై అన్నమో, రామచంద్రా యని అల్లల్లాడు దరిద్రనారాయణుల ఆక్రంద ధ్వనులు మిన్నుముట్టుచున్నవి. చతుస్సాగర, పర్యంత భూమండలాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలిన విష్వక్సేన, విక్రమాదిత్య, హరిశ్చంద్ర, నల, నృగ, నహుష, భగీరథు, భరత, మాంధాతాది మహారాజులు తమ భూభృంగ నిక్షేపములో గడగడ లాడించిన యీ పుణ్యప్రదేశంలో ఎంతటి అరాజకము! ఎంతటి అసూయా! ఎంతటి నిరాదరణ! ఎంతటి నిర్దయ! అన్నదమ్ములకింతటి అకారణ కలహము! భూస్వాములను కోసిన రక్తము, కర్షకులను కోసిన పాలూనా! ఏమి యీ విపరీతము! ఏమి యీ వింత! ఏమి యీ ఆశ్చర్యము! ఆస్పంద మిళింద సుందర వికసిత కుసుమరాజమాన మల్లికామతల్లికే విభ్రమమాణ కారిణులగుచు, సుందరీమణులు దృష్టిసారించుచున్నారు.

కరతాళ ధ్వనులు.

డైరె: చూశారా కవీ! విప్లవం, ప్రజారాజ్య స్థాపన అన్నీ ఒక్కదెబ్బతో సాధించాను.

కవి : కాని, మన కథ క్కేం సంబంధమండీ.

డైరె : సంబంధం లేదని వ్రాసుకుంటూ మటయ్యా! వెర్రి వాడా? ఇటువంటి స్టార్ దొరికినప్పుడు అన్నివిధాలా ఎక్స్ప్లాయిట్ చెయ్యాలిసిందే. పిక్చర్లో బర్నింగ్ ప్రాబ్లమ్స్ లేకపోతే ఎలాచెప్పు?

కవి : చిత్రం. ఇక నేను చెప్పేది ఏమీ లేదండీ.

తెరపై ఉప్పెన.

కవి : ఈ వుప్పెన ఎందుకండీ పెట్టారు.

డైరె : క్లయిమాక్స్ కోసం. అందుకనే కథ టెక్నిక్ వేరు, సినిమా టెక్నిక్ వేరు అని మొత్తుకునేది.

కవి : అలాగా! అయ్యయ్యో! కథానాయిక ఆ దురాత్ముడి వాళ్ళో కూర్చుందేం? అయ్యో! అతడు ఆమెని ముట్టుకుంటేనే భస్మం కావలసిందే? అతని వొళ్లో ఎలా కూర్చుందండీ?

డైరె : తొందర పడకండి. ఆవిడ ఎవరో తెలుసా? హేమాంగి.

కవి : అయితే?

డైరె : హేమాంగిని ఆపోజ్‌లో తియ్యగలిగాడూ, ఏడైరెక్టరన్నా? చూస్తారుగా రేపు, ఇసుక వేసినా రాలని జనం. గ్రేట్ బాక్సాఫీస్ హిట్.

కవి : ఓరి, నీహిట్ బంగారం గానూ!

డైరె : అదేమిటి కవీ!...మీ కవులకున్న రోగమే ఇది... ఏ షేమిట్లో గ్రహిస్తారు...అవన్నీ కాగితం మీద

పెడతారు... ...వాటినన్నిటినీ మేము సినిమాకు సర్దుకునే టప్పటికి తలప్రాణం తోకకి వస్తుంది.

కవి : అయితే నాకొక సంగతి అడుగుదామని ఉందండీ డైరెక్టరుగారూ...

డైరె : అడుగు కవీ.

కవి : నా కథలో, మీరు చేసిన మార్పులు పోగా ఇక మిగిలిందేమిటండీ!!

డైరెక్టరు ఇంతింత కళ్ళుచేసుకుని కవిని ఎగాదిగా చూస్తూఉంటాడు.

— ... —

# వెంకటయ్య మంకుపట్టు

## పాత్రలు:

| | |
|---|---|
| వెంకటయ్య | రామానందం |
| సీతయ్య | కాంతమ్మ |
| తులసెమ్మ | డాక్టరు |

---

వెంకటయ్య దస్కం ముందు కూర్చుని రూపాయిలు లెక్క పెట్టుకుంటూ వుంటాడు. ఎదురుగా సీతయ్య వుంటాడు.

వెంకటయ్య : అరవై, అరవైఅయిదు, డెబ్భై, డెబ్భై అయిదు... ఏం సీతయ్యా ఇంకా కొద్దునవుంచావే?

సీతయ్య : ఎంత ఇవ్వాదేలానండీ?

వెంక : తొంభై ఎనిమిదిరూపాయిల ఏడణాలు ఇవ్వాదేలావ్!

సీత : అంత మొత్తమా? అంత మొత్తం ఉందా వెంకటయ్య గారూ! ఎక్కడో తప్పిలు పడివుంటుంది. మళ్ళీ ఒక్కసారి లెక్క చూడండి.

వెంక : బాగుంది. అయితే నేనేం కలిపానంటావా లెక్కల్లో!

సీత : అయ్యయ్యో... నేను అంతమాట ఎట్లా అంటాను వెంకటయ్యగారూ... కష్టాల్లో ఆదుకున్నారు. కాకపోతే, నా మతికి నేను తీసుకుంది అంత ఉన్నట్లు జ్ఞాపకం లేదు.

వెంక : ఎట్లా జ్ఞాపకం వుంటుంది! 'ఇదుగో ప్రాణం మీదకు వచ్చింది. అదుగో ప్రాణం మీదకు వచ్చింది' అని

అయిదువ్వలూ, పదులూ తీస్తావుంటివి. ఇవ్వాల్సి వచ్చే
ప్పటికే...

సీత : లేదండీ వెంకటసుబ్బయ్యగారూ, మీరేమీ అను
కోకండి... ఎంత ఇవ్వాలో చెప్పండి... అలాగే
ఇచ్చుకుంటాను.

వెంక : కనపడుతూ నే వుండగా ఇంకా అడుగుతా వెందుకు
సీతయ్యా. నువ్వు ఇవ్వవలసిన అసలు ఫాయిదాలు,
ఇవ్వాల్సికి తేలిన మొత్తం, తొంభైఎనిమిది రూపా
యల పడణాలు; ఇచ్చింది ఇరవైఅయిదు రూపా
యలు... ...ఇంకా ఇరవైమూడు రూపాయిల ఏడ
ణాలు ,ఇవ్వాలి... మాట్లాడవేం?

సీత : చాలా కష్టాల్లో వున్నాను వెంకటయ్యగారూ...
మీకు తెలియంది దేముంది? ... ఒక్కగాను ఒక్క
కొడుకు వుంటే బలవంతపు చావు చచ్చాడు...వున్న
వొక్కకూతురూ మొగుణ్ణి పోగొట్టుకుని, గంపెడు
పిల్లల్ని వేసుకుని, నా కొంపకే జేరింది...

వెంక : ఇవన్నీ నాకెందుకు చెపుతావ్ సీతయ్యా? నీకుటుంబ
భారం మోస్తానని నేనెప్పుడైనా హామీ ఇచ్చానా?
ఎవరికి వుండే కష్టాలు వారికి వుంటై. 'ఎంత చెట్టుకి
అంత గాలి' అన్నారు.

సీత : ఆ మాట నేను కాదనటం లేదు వెంకటయ్యగారూ.
ఆనాడు న్నా అవుసరం కొద్దే అనుకోండి – మీరు

ఎంత వడ్డి అడిగితే అంతకీ సరే, అప్పును... పేరు
అందరూ తీసుకున్నట్టు లెక్క కట్టారంటే నన్ను...

వెంక: అయితే వడ్డీ తగ్గించమనేనా నువ్వనేది! ఈమాట
ఏ మొహం పెట్టుకొని అడుగుతున్నావు సీతయ్యా!
అప్పుడు నాదగ్గఱ వెసులుబాటు కాదంటే, ఎంత
కైనా ఇవ్వమని కాళ్ళావేళ్ళా పడి, ఇప్పుడీమాటలా!
నాదగ్గఱ ఈ నంగి నంగి మాటలు సాగవు......
మిగతాడబ్బు వారం రోజుల్లో సర్దావో సర్దావు...
లేకపోతే ఏం చేస్తానోచూడు...

సీత : మీరంత గట్టిగా అడిగితే తప్పేదేముంది వెంకటయ్య
గారూ? ఉన్న అగ ఎకరం పోయింది. తలదాచుకునే
కొంప పోయింది. ఇక మిగిలింది ఒక బఱ్ఱె. దాన్ని
అయినకాడికి తెగనమ్మి మీ అప్పు తీరుస్తాను.

వెంక: అది నీ ఇష్టం. నువెట్లాగన్నా తీర్చు. ఇక నీ అప్పు
వారం రోజులకంటే వొక్కగడియ ఆపడానికి వీల్లేదు.

సీత : కోపం తెచ్చుకోకండి వెంకటయ్యగారూ. మీ అప్పు
దమ్మిడీలతోసహా తీరుస్తాను... ...వెళ్ళివస్తా......
(సీతయ్య వెళతాడు) మలపవెధవలు... ...ఇవ్వాల్సి
వొచ్చేటప్పటికి నానా ఏడుపులూనూ! తీసుకునే
టప్పుడు ఉండక్కర్లా!...తులిసెమ్మా! తులిసెమ్మా!
ఎక్కడ చచ్చారే అందరూనూ...?

తులి : (ప్రవేశించి) ఏం నాన్నా?

వెంక: అబ్బాయి ఎక్కడున్నాడే?

తులి : ఇంకెక్కడుంటాడు నాన్నా? ... నీ కోడలు, ఇంట్లో వుంటే వంటపని చేయబడుతుందని, ఏదో పనిఉన్నట్లు పసువుల కొట్టంలోకి వెళ్ళింది. ఇంకేం, తానుకూడా అక్కడకు జేరివుంటాడు.

వెంక: వాడికోసం నేను నానాగడ్డి కరిచి సంపాదించటమునూ, వాడేమో పెళ్ళాంతో జేరి తైతెక్కలాడటమూనూ! పీడి మొహానికేలోడు ... ఏవో మీటింగులట !... ఏదో వూరిని ఉద్ధరిస్తాడట ! పెళ్ళాన్ని విడిచి పెట్టి వొక్క గడియ వుండలేని నాప !!

* * *

మేస్తున్న పశువుల మెడలోని గంటలూ, మువ్వలూ, ఆవుల అంబారవములూ వినిపిస్తూ వుంటై. బాక్ గ్రౌండులో ... ... వెంకటయ్య కుమారుడు పశువులకు గడ్డివేస్తుంటాడు. దూరంగా అతని భార్య కాంతిమ్మ గోడకు పిడకలు కొడుతూ వుంటుంది.

రామ: ఏం చేస్తున్నావ్, కాంతా?

కాంత: అబ్బబ్బబ్బ ... ఎన్నిసార్లు చెప్పానండీ... చెప్పి చెప్పి నోరు కాయకాసి పోతూవుంది...

రామ: మళ్ళీ ఇంకొకసారి చెబితే, నీ సొమ్మేం పోయింది కాంతా?...వినాలని వుంది.

కాంత: గోడకు పిడకలు కొడుతున్నానండీ...

రామ: ఏమిటీ? దగ్గఱకు రమ్మంటున్నావా?... ... ఇదుగో వస్తున్నా ... ... (దగ్గరకు వెళ్ళి) ఎందుకు కాంతా, పిలిచావు?

కాంత: (నవ్వుతూ, సిగ్గుపడుతూ) బాగుంది ... మీ శౌనా తనం చూపటానికి నేనొకదాన్ని దొరికాను ... అది సరేగానీండి... ఏమిటి ప్రొద్దున్నే లేచి మామగారితో కీచులాడుతున్నారు ?

రామ: మామూల్దే...

కాంత: అంటే ?

రామ: చూడు కాంతా, మనం కొద్దోగొప్పో ఉన్నవాళ్ళం గదా. ఈ పశువుల్ని దొడ్లోనే వుంచుకోవటం ఎందుకు చెప్పూ...ఒకప్రక్క ఊపోగూ, వొకప్రక్క ఈ ముళ్ళకంపా, ఈ పశువులగలీజూ ఇందంతా ఎంత అనారోగ్యం చెప్పు... 'ఇదంతా రోగాలకుమూలం- పశువులకొట్టం ప్రత్యేకంగా వేయించి ఇదంతా బాగుచేయించకూడదా ?' అన్నా ...

కాంత: వారేమన్నారు ...!

రామ: ఇంతఎత్తున లేచాటు—'రోగాలువస్తయ్యా రోగాలు! నాకు రావేం ? నాకిప్పుడు డెబ్బయ్యేపడి – చిర్రున చీదిఎరుగను ... పనీపాటా లేకుండా పోతుల్లే తిని తిరుగుతూంటే రోగాలు వస్తయ్...... వీటికెందు కొస్తయ్ !' అని నానామాటలూ అన్నారు.

కాంత: అంటే అన్నారుగాని చీటికీమాటికీ వారితో మాటా మాటా పెంచుకోకండి...ఏదో పెద్దవాడు ... వారిఅల వాట్లు వారికున్నయ్ ... అలవాట్లను అకస్మాత్తుగా మార్చుకోమంటే ఎవ్వరికైనా కష్టంగా వుంటుంది చూడండి !

రామ: అసలు మాట చెవారనివ్వందే!

కాంత: పోనీలెద్దురూ...

తులి : (లోపలనుంచి) కాంతమ్మా! ... కాంతమ్మా!

కాంత: అదిగో వొదిన వస్తోంది. మీరు వెళ్ళండి ... పని చేయకుండా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం అంటుంది.

రామ: రానే వచ్చింది.

తులి : (దూరాన్నుంచి) ఏం చేస్తున్నావే?

కాంత: పిడకలు చేస్తున్నా వొదినా...

తులి : ప్రొద్దుటినుంచీ చేస్తున్నావ్! ... ... ఇంతచిట్టు పోగు చేశావ్ దేనికి?

కాంత: చిట్టు లేకుండా పిడకలు చెయ్యటం ఎట్లా వొదినా?

తులి : అదేమిటే అన్నీ నీకే తెలిసినట్లు మాట్లాడతావ్? కాస్త వెలిబూడిద ముందువేసుకుని చేసుకోరాదూ? ఇంతే చిట్టు పాడుచేసుకొని పిడకలు చేస్తే ఏం; చెయ్యకపోతే యేం? వెనకటికి ఎవరో అన్నారుటలే 'లాభాలు గూబల్లోకి వొచ్చినయ్య'ని... అట్లా ఉంది నీ పని...

కాంత: ఇకనుంచి నువ్వు చెప్పినట్లే చేస్తాలే వొదినా...

తులి : ఏమోనమ్మా ... మీా యిష్టం ... నేనేదో చుట్టపు చూపుగా వొచ్చి నాలుగురోజులు వుండిపోయేదాన్ని ...నాకెందుకీ గొడవలన్నీ ... నువ్వేం చేస్తున్నావురా ఇక్కడా?

రామ: కాంతానికి పిడకలు చెయ్యటం నేర్పుతున్నానక్కా.

తులి : ఒరేయ్ ... పెద్దదాన్ని ... పైపెచ్చు అక్కని ... నాతోనట్రా నీ పరియాచకాలు.

రామ: పరియాచకం కాదక్కా. నిజమే ... కాంతానికి పిడకలు చెయ్యడం బొత్తిగా రాదు. వచ్చిందైతే వెలిబూడిదతో చెయ్యక, చిట్టుతో చేస్తుందా అక్కా ?

కాంత: ఊరుకోండి ... ఎవ్వరైనా వింటే నవ్విపోతారు ... ఆయనమాటలు నువ్వు పట్టించుకోకు వదినా !

తులి : ఏమోనమ్మా ... కన్నవారింటిమీదవున్న మమకారం కొద్ది నాలుగు రోజులుండి పోదామని వచ్చా. వారు అననే అన్నారు ... 'సీతల్లి అనే వస్తువుకాస్తా దాటిపోయిం తర్వాత, అక్కడ నిన్ను పలకరించే దిక్కెవరే పిచ్చిదానా' అని ... ఉండబట్టలేకవచ్చా. వచ్చినందుకు మీ అందరిచేతా మాటలుపడుతున్నా.

వెళ్తుంటుంది.

కాంత: పెద్దావిడతో మీ కేమిటండీ ఆపరియాచకం ... కాస్త మంచిమాట అంటే మీ నోటి ముత్యాలు ఏమి రాలి పోతై?

రామ: ఏమో కాంతా ... ఈ పరిస్థితిని నేను ఎక్కువకాలం భరించలేను.

కాంత: సరేలెండి ... వెళ్ళి మీ పని చూసుకోండి ... నేనూ ఈ కాస్తపనీ పూర్తి చేసుకుని, వొద్దినెకి వంటపనిలో

సహాయపడాలి. చుట్టపు చూపుగా వొచ్చినావిడతో
పని చేయించుకోవటం కూన కేం మర్యాద? ...

రామానందం పశువులకొట్టంలోకి వెళ్తూ వుంటాడు. కాంతమ్మ పిడకలు కొట్టటానికి గోనసగ్గరకు వెళ్తుంటుంది. ఆమె కాలిలో ముల్లు గుచ్చుకుంటుంది

కాంత: అబ్బబ్బ... అయ్యయ్యో...
రామ: ఏమిటి కాంతా? (పరుగెత్తుకుంటూ వస్తాడు)
కాంత: కాల్లో ముల్లు విరిగిందండీ..
రామ: ఏదీ? ... (పాదం పట్టుకుంటాడు)
కాంత: అబ్బ! వదలండి.
రామ: చాలా లోతుకు దిగబడింది.
కాంత: అయ్యయ్యో...అబ్బో... బాధగా వుందండీ...
రామ: కాస్త ఓపిక పట్టు కాంతా... లాగేస్తాను...

ముల్లు తీస్తాడు.

కాంత: అయ్యో!!
రామ: ఆ! ఇదిగో... ఎంత పెద్ద ముల్లు! ఇంట్లోకి పద ...
కట్టు కట్టించుకుందువు గాని ... నన్ను పట్టుకు
నడువు ...

* * *

ఇంట్లో గది. కాంతమ్మ మంచంమీద పడుకొని మూలుగుతూ
వుంటుంది. జ్వరం తీవ్రంగా వుంటుంది. రామానందం పక్కన
కూర్చొని వుంటాడు. సీతయ్య దగ్గర్లో నిలబడి వుంటాడు.

కాంత: ఎవ్వరో పిలుస్తున్నారు...నన్ను రమ్మంటున్నారు. ఓ! ఎంత వెలుగు! ఎక్కడచూసినా దీపాలే! ... అంతా దీపావళీ చేసుకుంటున్నారు. (మూలుగుతుంది)

రామ: కాంతా! కాంతా?

కాంత: ఎవ్వరు?... ఎక్కడో విన్నట్లుందీ పిలుపు?

రామ: నేనే కాంతా... ఇటు చూడు!

కాంత: ఇదిగో వస్తున్నా... దీపావళికని మాఅమ్మ వాళ్క పట్టుపరికిణీ, వోణీ కుట్టించింది. అవి వేసుకుని... ఏవీ అవి... ఎవ్వరో దొంగలు ఎత్తుకునిపోయారు. ... ... (ఏడుస్తుంది.)

వెంక: (ప్రవేశించి) ఎట్లావుందిరా అబ్బాయి?

రామ: ఎక్కువైందినాన్నా... సంధిమాటలుకూడా ప్రారంభించింది.

వెంక: తెల్లవారేటప్పటికి అదే తగ్గిపోతుందిలే. ఏదో మలప జ్వరం...

కాంత: బండికట్టించు నాన్నా... ఎడ్లకి మువ్వలూ, గంటలూ పెట్టి, సికమార్లుత్తొడిగి అందంగా అలంకరించు... ... చూచినవాళ్ళంతా ఆనందంతో వుప్పొంగి పోవాలి.

రామ: నాన్నా, డాక్టర్ని పిలుస్తా...

తులిసెమ్మ ప్రవేశిస్తుంది.

వెంక: ఏమిటీ?

రామ: అవును నాన్నా... నాకెందుకో భయంగావుంది.

తులిసెమ్మ: ఈమాత్రం భాగ్యానికి డాక్టరెందుకురా? ... కాల్లో కాస్తముల్లు ఇరిగి పులకరం వొస్తే డాక్టర్ని పిలుస్తావ్రా ?

రామ: నాకు తెలియదక్కా. మీ మాటలువిని నాలుగు రోజులనుంచీ వస్తాయించాను...... అప్పుడే డాక్టర్ని పిలుచుకొస్తే ఇంతదూరం రాకపోవును.

వెంక: ఒరేయ్! ఇప్పుడంటే అన్నావు గాని, ఇంకెప్పుడూ ఇటువంటిమాట నాదగ్గర ఎత్తకు. డాక్టరుని పిలుస్తావ్రా... డాక్టర్ని ... డాక్టరువచ్చి తీసేస్తాడా ? నేను నలభై ఏళ్ళనుంచీ ఈ ఇంటి వ్యవహారాలు చూసుకుంటున్నా... ఇంతవఱకు డాక్టరనేవాడు నా గడప తొక్కి ఎరగడు...

కాంత: నన్ను వెళ్ళనివ్వరూ ? ... ఎందుకు నన్నిట్లా పట్టుకు బంధిస్తారూ ? ... విడిచిపెట్టండి...

రామ: కాంతా ! కాంతా ! ...

సీత : మళ్ళీ తెరవొచ్చినట్లుంది.

రామ: సీతయ్యమామా ... నేను వచ్చేవఱకూ కాంతని కొంచెం కనిపెట్టివుండు ...

బయటకు అడుగులు వేస్తాడు.

వెంక: ఎక్కడికిరా ?

రామ: టౌనుకి వెళుతున్నాను.

వెంక: దేనికి ?

రామ: డాక్టర్ని తీసుకురావటానికి.

వెంక: ఆఁ! నామాటకే ఎదురు చెప్తున్నావుగా... ఈ ఇంటికి డాక్టర్ని తెచ్చావంటేచూడు ఏంచేస్తానో... నువ్వూ నీ పెళ్లాం, ఈ ఇంట్లో ఒక్క గడియ ఉండటానికి వీల్లేదు.

రాము: అట్లాగే నాన్నా ... ఈ ఆపద గడిచి గట్టెక్కితే మరుక్షణమే వెళ్ళిపోతాం. (వెళ్తాడు)

వెంక: చూడు వీడిసేం చేస్తానో... ఈ ఆస్థి అంతా నా కష్టార్జితమే! వీడికొక దమ్మిడీ కుట్టనివ్వను. ... (తులిసెమ్మను చూచి) ఎందుకే అట్లా చూస్తూ నుంచున్నావ్! ఇంట్లోకి ఏ కాక్కులూ - కోళ్ళూ దూరినయ్యో పోయి చూసుకో.

తులి : బాగానేవ్వుంది ఈ సరాగం ... ఏదో సామెత చెప్తారే 'ఉరుము ఉరిమి మంగళంమీద పడ్డద'ని ... అట్లా వుంది.

*　　　　*　　　　*

కాంతమ్మ పడుకొని వుంటుంది. వెంకటయ్యా, సీతయ్యా, తులిసెమ్మా చుట్టూనుంచొని ఉంటారు.

తులి : ఎట్లా వుంది కాంతమ్మా?...

కాంత: చాలా తేలిగ్గా వుంది వొదినా... మబ్బుల్లో తేలి పోతున్నట్లు వుంది.

వెంక : నేను చెప్పలా? తగ్గుతుందిరా అంటే నామాట విన్నావా? డాక్టరుకోసం పరుగెత్తాడు: (సీతయ్యతో) ఈ డాక్టర్ల కేముంది సీతయ్యా?, ఉన్న జబ్బునే

ఎక్కువ చేస్తారు! ఏవో పెద్ద పెద్ద పేర్లు చెబుతారు! డబ్బు గుంజుతారు!

కాంత: వారిది తప్పే... డాక్టరుకోసం... వెళ్ళకుండా వుండ వలసింది... అబ్బా!... ఉ... !

సీత : మళ్లా మగత కమ్ముకుంటూ వున్నట్టుంది వెంకటయ్య గారూ...

వెంక: అదే విడిపోతుంది లే...

సీత : అదుగో డాక్టరుగారు వొచ్చారు... అబ్బాయి వెంట పెట్టుకొనే వచ్చాడు.

డాక్టరు, రామానందం ప్రవేశిస్తారు.

డాక్టరు: పేషెంట్ ఎక్కడ?... అడ్డం లేవండి... గాలీ వెలు తురూ రాని ఈ గదిలో ఉంచారేం?

రామ: ఉన్న గదుల్లోకి మంచిగది ఇదేనండీ!

డాక్ట : అమ్మాయ్! (చేత్తో పరీక్షిస్తూ ఉంటాడు)

కాంత: ఉ... అబ్బ...

తులి : ఇప్పటిదాకా గంట కొట్టినట్టు గణగణ మాట్లాడు తూనే ఉందండీ...

డాక్ట : కొంచెం అటు తిరుగమ్మా... (త్రిప్పబోతాడు)

కాంత: ఉ... అయ్యో!... ఉష్...

డాక్ట : కాస్త అటు త్రిప్పండి.

కాంత: అబ్బబ్బ... నా ప్రాణాలు పోతున్నాయి...

రామ: లేదు కాంతా, డాక్టరుగారు వచ్చారూ చూడు!

డాక్ట : (పరీక్ష పూర్తిచేసి)... ఇటీవల ఎక్కడైనా దెబ్బ తగిలిందా?

వెంక: దెబ్బా లేదు... ఏమీ లేదు.

డాక్ట: ఏదైనా గుచ్చుకోవటంగానీ...

రామ: వారంరోజులక్రితం దొడ్లో పని చేస్తుంటే ముల్లు గుచ్చుకుందండీ.

డాక్ట : ఎక్కడ ?

రామ: కాలికి.

డాక్ట: అలాగా !

డాక్టరు పరీక్షించడానికి కాలుపట్టుకుంటాడు.

కాంత: అయ్యయ్యో !... ఊ... ఊ...

డాక్ట : (పరీక్షముగించి) చాలా అశ్రద్ధచేశారు. ... ... ఇంత ముంచుకొని వచ్చేదాకా చూస్తూ ఊరుకున్నారేం ?

రామ: ఏదైనా విషజ్వరమా డాక్టరుగారూ ?

డాక్ట : ధనుర్వాతం ...

రామ: ఆ ! ప్రమాదం లేదుగదా ... ?

డాక్ట : ఎలా చెప్పను ? ... ఈ జబ్బువచ్చినవారు, నూటికి ఒకరు బ్రతకటంకూడా కష్టమే ... ఇంజెక్షన్ ఇస్తాను - తరువాత మీ అదృష్టం ... (మందున్న చిన్నబుడ్డి మూత పగులకొట్టి సూదిలోకి మందుఎక్కిస్తూ) మీరు ఇన్నాళ్ళు ఎందుకు ఉపేక్షిస్తూ వూరుకున్నారో

నాకర్థం కావడంలేదు...ముల్లు గుచ్చుకోగానే ఒక ఇంజెక్షన్ ఇప్పిస్తే, ఈ ఆపదే వొచ్చేదికాదు.

వెంక: బాగుంది మీరుచెప్పేది ... తెల్లవారిలేస్తే మాకు ఎన్నిముళ్లు విరగటంలేదు. మాకందరికీ వొచ్చినయ్యా ఈరోగాలు !

డాక్ట : ముల్లువిరిగిన ప్రతివారికి వస్తుందని నేను అనటంలేదు. గుచ్చుకున్న ముల్లును బట్టి, వాళ్ళ శరీర స్థితినిబట్టీ వొస్తుంది–పశువుల కళ్ళెలం దగ్గర్లో వుంటే సోకడానికి ఇంకా సులువౌతుంది ... అమ్మాయిని పట్టుకోండి ఇంజక్షన్ ఇస్తాను...ఆ! ... అట్లా జాగ్రత్త ... (ఇంజక్షనిస్తాడు)

కాంత: అయ్యో... అబ్బబ్బో...

డాక్ట : ఆ ! ఇంక వదలండి.

రామ: నయం అవుతుందిగా డాక్టరుగారూ ?

డాక్ట : ఎవ్వారం చెప్పలేము... ... మన ప్రయత్నం మనం చేద్దాం...

*    *    *

అదే సీను. డాక్టరు మాత్రం వుండడు.

రామ: కాంతా ...?

కాంత: మీరు ... కన్నీరు పెట్టుకోకండి...నా గడియలు దగ్గరకు...వస్తున్నాయ్ ... ... (రామానందం ఏడుస్తూ) మామగారూ ... నే నేమన్నా ... తప్పులు చేస్తే ... నన్ను క్షమించండి...వొదినా... ఇట్లా రా వొదినా

... ఇట్లా కూర్చో ... నా చేతిలో చెయ్యి వెయ్యి వదినా ... ...అబ్బా! (పెద్ద పెట్టున కేకేసి మరణి స్తుంది.)

రామ: కాంతా ! కాంతా ! (మీదపడి ఏడుస్తాడు)

తులి : కాంతమ్మా—చిన్న దానవైనా తల్లో నాలికల్లే మెది లావు. మమ్మల్నందర్నీ ... ఏంచేసి పోయావమ్మా ?

రామ: కాంతా! కాంతా! ... నాతో మాట్లాడవే ... నన్ను పలకరించవే... ఇక నన్ను పలకరించవా కాంతా! (ఏడుస్తాడు)

వెంకటయ్య దుఃఖంతో ఊగిపోతాడు. చెక్కిళ్ళమీద నుంచి కారుతున్న కన్నీటిని తుడుచుకుంటూ కొడుకు దగ్గరకు అడుగులువేసి భుజంమీద చెయ్యివేస్తాడు.

వెంక: బాబూ!

రామ: నాన్నా!

వెంక: నన్ను క్షమించు బాబూ! ... నా మూర్ఖ్యం వల్ల నిన్ను రెక్కలు లేని పక్షిని చేశాను ... ఇంటి లక్ష్మినిపోగొట్టు కున్నారా నాయనా. ఇక నే బతికేం; చచ్చేం! (ఏడుస్తాడు)

రామ: నాన్నా!

వెంక: బాబూ!! (పెద్దపెట్టున అరచి, పొర్లివొచ్చే శోకాన్ని ఆపుకోలేక కొడుకుని కావిలించుకొని ఏడుస్తాడు)